శ్రీ

# శ్రీవల విలాసము.



ఇది

చాట్రాతి చినవెంకటప్పయ్యచే

రచియింపఁబడినది.



పాలి వెంకట మునియ్య గారి స్వకీయవ్యయమున

ఏలూరు శ్రీ పాండురంగ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

1935

మొదటికూర్పు 1000 ప్రతులు.

 [దీని వెల రు 1-0-0.



గ్రంథకర్త:

చాత్రాతి చినవెంకటప్పయ్య.

# పీఠిక.

ఆర్యులారా!

ఈ కృషీవలవిలాసము 558 కేవలపద్యాత్మికమగు ప్రబంధము. నాలుగధ్యాయములుగలిగి యొప్పుచున్నది. ఇది యొక కథగాక సర్వ ప్రపంచవృత్తమును సర్వప్రపంచభాగ్యములను కృషీవల కార్యమునం దిమిడి యున్నట్లు విరచింపఁబడినది. ఈ గ్రంథకర్తలు నాయొద్ద విద్యాభ్యాసము చేయుచున్నతఱి వీరి సహాధ్యాయులకును వీరికిని నేను గ్రామాంతరమునకేగు తఱి నేను వచ్చువఱకు కృషీవలుఁడను పేరున నెవరికితోఁచినన్ని పద్యములు వారు వ్రాయుఁడని చెప్పితిని. అది ప్రధానముగాఁదీసికొని వీరొక్కరే పట్టువిడువక సమాప్తపరచిరి. నాకప్పుడప్పుడు వినిపించుచు వచ్చినసమయమున నక్కడక్కడ కొన్ని స్ఖాలిత్యము లగపడినను నవి తప్పులుగా జూపించి ఆశాభంగమును గలిగింపక సంతసింపఁజేయుచు వచ్చితిని. పదంపడి యీ గ్రంథము నాచేతిమీదఁనే శుద్ధప్రతి వ్రాయవలసి వచ్చినది. ఆ సమయమునఁ బూర్వము నేననుకొనినన్ని స్ఖాలిత్యములు పద్యములలో లేకుండెను. అవి పునఃపఠనమున గ్రంథకర్తలే సవరించుకొని యుండిరి.

పూర్వము గునుకుసీసములను దశావతార పద్యరచనను బోలె వీరిరచనయుఁబ్రథమమునఁ బొడకట్టుచువచ్చి రానురాను కవిత్వము ధారాళపాకమున విలసిల్లినది. నేనీ గ్రంథమున విమర్శించినది యేమి యన నించుక ఛందస్సును, వ్యాకృతియునై యున్నది. పదప్రయోగములు, స్వభావవర్ణనములు, వీరిరచనయందు అగాధముగాఁ గాన్పించును. మరల మరలఁ జదివి యిందేమి విశేషముకలదోయని యూహించుకొను వారికే దాని యర్థము బోధపడఁగలదు.

ఈ రచనవృత్తములకూర్పు నేర్పుకొనుటకై నియమింపఁబడినదగుటచే నేను వీరి యభ్యాసకౌశలమును బెంపొందించినదని నుడువుచుంటిని. మఱియుఁ బ్రథమ ప్రయత్నమగుటచే నాదిరచనాకాలము నిరూపింపఁగలదని వీరి వాఙ్ముఖాదికరచనను మార్పుచేయక అట్లే నిలుపునట్లు నియోగించితిని. వీరు అధ్యాత్మవిద్యావైశద్యము కల వారగుటచే రచనయందుఁ బెక్కుతావుల సాంఖ్యయోగబోధామృతమును వెదజల్లియుండిరి. ఇది యొకరిని నిందించుటకుఁగాని పొగడుటకుఁగాని అర్థపరియోజనమునకుగాని, వ్రాసినదిగాక కేవలాభ్యాస పరతంత్రతచే వ్రాసిన గ్రంథముగాన, పండితులు దీనియందలి సుగుణమునే గ్రహించి ఆనందింతురు గాకయనియు, ద్వితీయ ప్రయత్నమున నిక్కవి మఱియు సరళరీతి మహోత్కృష్ట కావ్యములను రచియింప నాశీర్వదింతురుగాక యనియుఁ బ్రార్థించుచుంటిని.

కవినాథవిలాసము,
ఏలూరు.
7—2—1935

ఇట్లు సజ్జనవిధేయుడు,
కొత్తపల్లి సుందరరామయ్య,
లక్కవరాస్థాన విద్వాంసుఁడు.





శ్రీ

# కృషీవల విలాసము.



శా. శ్రీభూదేవులు నాకశృంగకళవర్ధిల్లంగ మధ్యంబునన్
శోభాకాంతులఁ గ్రిక్కుచున్సుకగుణా శ్రీరామృతాసార మెం
తేభాసిల్లఁగఁ గేశకుంభముల మర్దింపంగఁ జాతుర్యతన్
భాభాసిల్లఁగ విష్ణుమేఘము సదావర్షంబుఁ గుర్పించుతన్. 1

ఉ. భాషయు, గానవిద్యయును, భాసురలీలను గుంభవృష్టి శ్రీ
భూషితహేమకుంభములఁ బూర్తిగ నింపిన స్తన్యపానమున్
భాషను బిడ్డఁడుంగుడువఁ బాయనివిద్యను బొందఁజేయుచుం
బోషణఁజేయు వాణి రసపుష్టిని గూర్చుచు నెప్డుఁబ్రోచుతన్. 2

సీ. ఛందస్సమంజస శాస్త్రార్థవాసనల్
సీసగీతములబ్బు చెలిమిఁగరపు
మత్తేభశార్దూల మాత్సర్యవాదముల్
మర్దించు సాధనమనఁగఁ గరపు
మాతంగవాక్సార మంజులనృత్తముల్
పొంగించు సొత్తుల పొత్తుఁగరపు
మందరాబ్ధిసువర్ణ మాంగళ్యహారముల్
గుట్టించి రెట్టించు గుటినిగరపు

గీ. వాణి, గణపతి, కాళి, సుభద్రి, లక్ష్మి
యస్మదీయ లసచ్చిత్తమందు నిలిచి
వర సుశబ్ద విన్యాసము పరువులిడఁగ
సిద్ధ మగు కావ్యసృష్టిని జేతురెపుడు. 3

ఉ. మాటలసొంపునన్ బ్రబలి మాన్యతఁ బొందిన యాంధ్రభాషయ
న్నాటకమందిరంబునను నాగరిభాషకు మేటివ్యాస సం
త్రోటిని జారు వాగ్రసను నూత్న విధానమునం బ్రబంధమున్
నాటిన నన్నపార్య సుగుణస్థిరుఁ దిక్కన నెఱ్ఱనార్యులన్. 4

గీ. ప్రణయ గౌరవ మొప్పఁగఁ బ్రస్తుతించి
వరుస నాంధ్రకవీంద్రులఁ బ్రబలఁబొగడి
కృష్ణదేవుని వాగ్యశఃకృషిని బెరుగు
భుజగభూషణు గృహాలక్ష్మి పుట్టుగొమ్మ
సుందరరస వాణిని నెప్డు స్తుతిని జేయు. 5

గీ. వర సువర్ణదానములను బ్రబలనిచ్చి
వర్ణగర్భిత గుణమణి కంటబండఁ
జంపకోత్పలమాలల జంటఁగూర్చి
తేటగీతలనీవిని దెలుపఁబలుకు. 6

ఉ. సుందరరామరాయకవి శోధన జేయుచు నూత్నమైన వా
గ్బంధుర కావ్యపోషణము గ్రాలుచుఁ గల్పనయుక్తిఁ బేర్చు నా
నందముఁ గూర్చు కారడవి నాగలిదున్నిన సేద్యగాని నే
చందము పొత్తుఁగూర్తువన సత్వరబుద్ధిని జింత సేయుచున్. 7

ఉ. సుందరవాక్సుధారసము సోకఁగ మత్తతఁజెందు భృంగవా
గ్బృందము కావ్యగానమున నెచ్చక సౌరభ శూన్యమా లతా
బృందముగూడునా? రసికబృందము మెచ్చఁగ నాట్యసౌరభా
నందము గుల్కఁగన్ గుణమయాకృత సుందరమాలఁగూర్పనా ?8

ఉ. నోటినిబుట్టుటన్విడువనోపదు సుందరరామరాయనిన్
మాటున శారదావిభుని మానవసృష్టియు వేదఘోషయుం
గాటుకకంటఁజూడదటుఖ్యాతి సహస్రపురాణకావ్య స
న్నాటక సృష్టికర్తఁగనినా కమలేశులనిల్వనిచ్చునే! 9

సీ. జగమెల్ల జలమయ జాహ్నవీజలజమై
కల్లోలభర్తను గాంతిమీఱ
వనచరవర్గము వారాశివాకిటి
మిండలై రోదన మిన్నుముట్టఁ
కాంచనతార్కనకాంతముకన్నీరు
కాల్వలై మిన్నేటి కల్వలంట
నిర్మలనీరము నీలము నింద్రియ
మైనావసదనమునండఁగొనఁగఁ

గీ. బ్రళయకాలాంతమున నీలరాగములరఁ
దనరఁ దలక్రిందుగావచ్చు ధరణివిభుని
బొడ్డులోనుండి పుట్టిన దొడ్డపువ్వు
బొమ్మదేవుని జన్మకుఁబుట్టినిల్లు. 10

ఉ. వెన్నుఁడు సృష్టిసేయుమని పీటికి బొమ్మనుబంపెఁ బ్రీతి సం
పన్నుని బద్మభాసముఖవర్ణము నాదములుప్పతిల్ల నా
సన్నుతకేళినుండి పడు సద్గురువేదము బ్రహ్మబీజమై
మిన్నునుముట్టఁ దన్మయము మేటివసిష్ఠుఁడు బుట్టె వ్యాసుఁడై. 11

చ. జగతిని బ్రహ్మవంశమున శాశ్వతకీర్తిని బ్రహ్మనిష్ఠచేఁ
బగటిని జేయు శాస్త్రముల భావముతర్కపుమూలగోష్ఠిచే
మగువల ధర్మమార్గమును మాటలు పుస్తకరూపతేజమై
నిగమము లేలు బోధనము నిర్గుణవాదము మేరమీఱుచున్. 12

చ. ధరణిఁ బురోహితుండయి సదా బుధవర్గము సేవఁ జేయుచుం
బరమపవిత్రమార్గమును భావనచేయుచుఁ బ్రొద్దుపుచ్చు శం
కర నరరాఘవోత్తముని కాండవిమోచనఁ జూచు భాగ్యమున్
స్థిరతర శాశ్వతాభ్యుదయసిద్ధిని బొందుదునంచు వేచుచున్. 13

చ. వరగుణకామధేనువును వాకిటఁగట్టిన చాకచక్యమున్
గురువగు బ్రహ్మదండమున గుట్టలుగొట్టిన బాణవాయువున్
మరుగున మెట్టు భీకరము మంజులవాదము బ్రహ్మతేజమున్
మరువఁడు విశ్వమిత్రుఁడు రమాపతిఁ బెంచిన విప్రసత్త్వమున్. 14

ఉ. నాథుని వేదభాష్యమును నంజనరుంధతి లోకపూజ్యయై
సాధులచెంతఁ జేరి పతిసత్త్వము సత్యము వెల్లడించి పై
గాథలు సత్ప్రవర్తనమగాధము స్త్రీలకుమార్గదర్శియై
భేదము లేని ప్రాణమున వేల్పులజాడను బట్టె నిత్యమై. 15

గీ. పారులామూలపురుషుని పాదునుండి
మొలకలై వ్యాప్తమొందిరి మూలవిద్య
తరచి బ్రహ్మచర్యగృహస్థతరువన విధి
సకలకర్మసన్న్యాసముఁ జక్కఁ జెప్ప. 16

సీ. బ్రహ్మవేత్తలుగాని బ్రహ్మమూర్తులుగారు
మానసకపివర్ణ మాంద్యమడఁపఁ
గర్మనిష్ఠులుగాని కర్మతంత్రకులుగా
రింద్రియాజి వితరణేష్టి గరుప
ధర్మగోవులుగాని ధర్మగోపులుగారు
సత్యవాక్పాలనశక్తి మరుప
రాజయోగులుగాని రాజభోగులుగారు
త్యాగసహితతను దానపటిమ

గీ. ననుచు జగములుభాషింప యజ్ఞకర్త
శాశ్వతానంద వైరాగ్యసత్యకీర్తి
వేదవేదాంతశాస్త్ర వివేకవేత్త
సుగుణమైత్రావరుణ నగసురభియశుఁడు. 17

మ. సగుణబ్రహ్మము సంస్మరించుచును విస్సంగత్వమే పారఁగాఁ
ద్విగుణత్వంబగు నిర్గుణైక్యమున సద్విద్యాప్రవేశంబు తే
రగు రాయంచ నిరూపసత్త్వమున మాయాతీతసంరంభియై
జగతింగేరు విదేహకీర్తి చనదే సత్యప్రవేశంబుకై. 18

క. కౌండిన్యస గోత్రజలజ
కాండ సుతీక్ష్ణసుదినమణి కాననరుచుల
య్యండాండము నిండియు బ్ర
హ్మాండమునాత్మసాక్షాత్కరించు హాస్యము జేయన్. 19

మ. కవితామాధురి రెచ్చఁబెట్టు గణసంగ్రామంబు సూచించు మా
ధవసంగీతము బిల్వఁబల్కు స్వరసంధానంబు పెంపెక్క గా
రవ విద్యాధను వెక్కబెట్టు కులపారావారసద్బీజమా
ఛవి కౌండిన్యసగోత్రమూలతరువున్ శ్లాఘింప శక్యంబొకో ! 20

సీ. కవిరాజ పరిపూర్ణ కాంతారవాస వ
శీకర సన్న్యాస చిత్తవృత్తి
భువిరాజభోగధీఃపూర నిరంతర
శిష్టప్రభాకర చిత్తవృత్తి
గవిరాజ నిర్మల గాత్రోగ్రసంచార
చిన్మయాకూటస్థ చిత్తవృత్తి
భవరాజయోగాంగ వాత్సల్య సత్యప్ర
చేతన నిర్గుణ చిత్తవృత్తి

గీ. చెలిమిఁగలిగి కవీశ్వరశీలభోగ
ధర్మగోగణశాంభవ మర్మవిద్య
లన్ని నేర్చి వృద్ధిం బొంది రమలవిధిని
తన్మునివరుని ప్రజ్ఞను తరిమెననిడి. 21

చ. కులనిధి గోపరాయమణిగుంభితశక్తిని నాఱువేల యో
గ్యులను నియోగపద్ధతిని గూర్చెను లౌకికకార్యధారణం
గలియుచు ధర్మశాస్త్ర జయఖడ్గముచే కలమంచు నిక్కుచుం
గలియుగనాట్యమత్సరముఁ గాల్చుచుఁ బేర్చిన రాజపూజ్యులన్. 22

చ. తదమల గోత్రసంజనిత దక్షనియోగులు విప్రపూజచే
బుధజనకీర్తనీయ మతపూజ్యులు లౌకికవేదతుల్యమౌ
విధమున జీవయాత్ర నయవీక్షణమొప్పఁగ భోగశీలురై
ముదమును గూర్తురెల్లరకు ముందరికాళ్ళకు లంకెవేయుచున్. 23

గీ. ప్రథమశాఖలు వృక్షముకాలఁగొట్టఁ
బ్రస్ఫుటపు నిగ్గుమాత్రము ప్రజ్వరిల్ల
మూలశాఖలు చాటారితి ముఖ్యసదన
నామధేయము వేంచేయు నాదియనఁగ. 24

ఉ. ఆకులరాజచంద్ర సుగుణార్భటిభూమికి నన్నదానమై
వ్యాకులచిత్తమానవులపాలికి నేలను దున్ననిచ్చుచున్
సాకును సేద్యకాపులను సత్యముదప్పక పన్నులీయకే
చీఁన నుండి మొక్కలను శిష్టుఁడు రాముఁడు గ్రామదేవుఁడై. 25

చ. గుణనిధి వేంకటార్యుఁడు నిగూఢసుపుత్రుఁడు శాంతిదూత ధీ
మణి నయధర్మరక్షకుఁడు మంగళవిగ్రహపూజలోలవా
గ్గణ విభవాభిరాముఁడు నిరంజనభక్తుఁడు ధర్మమార్గస
ద్గుణగణభూషణాంబరుఁడు దుర్గుణహంతక కర్మతంత్రుఁడై. 26

శా. మంగాంబావర భార్యయందుఁ గనె నిర్మాలిన్యసత్యప్రదున్
సంగోత్తీర్ణనిరోధశత్రుగణ శశ్వత్తుష్టశిష్టప్రదున్
రంగచ్ఛోభననేత్రగాత్ర గుణసారంభార్థి రక్షప్రదున్
భంగంబేటికలేని రామయను సౌభాగ్యప్రకాశాత్మునిన్. 27

ఉ. ఆనకుధర్మపత్ని వరియాన్నముఁ బప్పును కూరగాయలుం
గానని నేయిదప్పళముఁ గమ్మనిపండ్లును బిండివంటలుం
బానముఁ జేయ నీరమును భక్తినొసంగుచు యాత్రికార్థులే
దానముఁగోరనిచ్చుఁదలఁ దాల్తురు వెంకమయన్నపూర్ణనున్. 28

గీ. ఆపురాణదంపతుల నిర్వ్యాజశక్తి
వేంకటేశ్వర దేవర వెన్నముట్ట
ముగ్గురు కొమరులొక స్త్రీయు మొగ్గలైరి
ప్రథమతన్నామధేయము రాజిలంగ. 29

సీ. చినవెంకటప్పయ్య చిన్నతనంబునఁ
దద్గోత్రగృహనామ తర్పణవిధి
సన్నిహితజ్ఞాతి సద్వంశసంభవ
జానికరామేశ చతురబుద్ధి
పుత్రరత్నంబవు పూజ్యుఁడువీర వెం
కయధీరపురుషుని కాంతతనయ
పానకాలేశ్వర భక్తిప్రదాయికి
దత్తతస్వీకార తత్పరవిధిఁ

గీ. గరపు శేషాంబ తత్సతిపరమసాధ్వి
వెంకమాంబయనుజ సర్వవిధముల విభ
వాభ్యుదయములఁ గావింప నధికతఁగని
యవనిఁదద్వంశ మూలమైయలరువాఁడ. 30

గీ. లక్ష్మీనరసాంబ భార్యయైలక్షణాదిన
కరుఁడు జ్వాలానృసింహుని చరణసేవ
సరకనిర్మ్మలకుల సముద్ధరణ చిత్రి
కూపమై విస్తరిల్లు సుయూశదీప్తి. 31

## నృసింహస్తవము

సీ. మత్స్యకూర్మవరాహమానవ సింహవా
మనరామరామ రాఘవదనుజారి
బుద్ధకలికినిజపూర్ణావతార చై
తన్య సాక్షిజగదాధారనిత్య
బుద్ధశుద్ధవిమల భూర్భువస్సువసత్య
పరమాత్మ బ్రహ్మాండ భాస్కరాంశు
శాశ్వతానంద పరిశాంతవీక్షణ సర్వ
కల్మషనాశన కర్మసృష్టి
గీ. దండమున జగతినినంటు తనువుఁదాల్చి
నిజముఁసంటక సుఖయోగ నిద్రఁగూడి
భక్తులనుగాచు దుష్టుల వ్రక్కలించి
మానుషవివర్ణమాంద్యము మట్టిఁజేయ. 32
సీ. దానవమత్తేభదర్పము ధాత్రిని
సత్సవనహరణ శక్తిమీఱ
ఇంద్రాదిదేవత లీర్ష్యనుఖిన్నులై
కాంతారవాసము కాంతిమీఱ
బ్రహ్మేశభార్గవవర్గముని శ్రేష్ఠ
మాధవమాయకై మమతమీఱ
యాగ తపోదానయాత్రికమానుల
శాపపరికాండము లేపుమీఱ

గీ. మాతృగర్భంబు హరిభక్తి మనసుబట్ట
చాపులేని వరంబుల చట్టుగట్ట
దానవకులవిధ్వంస విధానబీజ
మవని ప్రహ్లాదుఁడు తనయుఁడై వగలుచు. 33

మ. హరియే దైవము సర్వపాపముల సంహారంబుఁ గావించు స
త్వరసంకల్పనిబద్ధకామచయవిధ్వంసంబుఁ గల్పించు జ
ద్వర పంచేంద్రియ చిత్తశుద్ధినిడు నిత్యంబైన మోక్షంబిడుం
బరమానందముఁ గూర్చునంచుఁ గడు సంభావించిబోధించుచున్. 34

క. జనకుఁడు తన్మతశత్రువు
కనకాంబరునింబలుకుచుఁ గావర మొప్పన్
మనకుమారునిబట్టును
గనికరమింతయును లేక కాళ్లనుపట్టన్. 35

సీ. హరియనుపిలుపున నాస్తిచే హత్తించ
బ కారులచేతఁ బట్టువడఁడు
వరహరిగీతలఁ జ తాళమునఁద్రోయ
కొండచిల్వలచేతఁ గొట్టువడఁడు
పద్మనాభిని బాడఁ బంకములోఁగొట్టు
నీటిలోముంచిన నెట్టువడఁడు
హరికథఁగల్పింప యజ్ఞవేదిని బెట్ట
నగ్నిలోఁద్రొక్కిన నంటువడఁడు
గీ. ప్రాణహంతకతనయుఁడై ప్రభనుమీఱు
హరిగిరియనుచుఁ బల్కెడు హర్ష మొదవ
స్తంభమందునఁ జూపుము చచ్చుహరిని
గాకఫలముజీల్చెదనని కత్తిమెత్త. 36

మ. నరసింహోగ్రవిరూపతేజమునఁ గన్యాలగ్నమూర్తంబుచే
కురఁ గ్రొంజీఁకటిమచ్చుపిక్కటిల ముంగోల్లేటుఖండంబులా
ధరమధ్యంబునఁ గారుచిచ్చులెగయన్ దట్టించి రక్తంబుఁ బీ
ల్చరి విధ్వంసము భక్తరక్షణము సింహాధ్వానమై వర్తిలన్. 37

ఉ. కుంకుమపూఁత బిందువులు కుండలిమధ్యమునుండిజారి పై
బింకము మిత్రితర్పణము వెట్టలసీడచు డెల్లబాఱ నా
వంకనునున్న శైత్యసమవాతము నిర్మలనీరమైచనన్.
సంకులఁగూడి కృష్ణమును సత్వరనామమువల్చు నల్పురాన్. 38

చ. దనుజుని దేహదండమున ధాత్రిని నిల్చిన శల్యవృద్ధులే
ఖనిజముఁగూర్చు పర్వతము కావలికోఁతులు సత్యవిద్యచేఁ
గనకము నిప్పుఁగూర్చి తగఁగాల్చిన నిత్యుఁడు ధర్మదేవతన్
జనములు సేవసేయుటను సంతతినిచ్చుచుఁగ్రాలు దేవుఁడా. 39

శా. వేదాద్రీశుఁడు సత్యకంబమున సంప్రేక్షోగ్రశస్త్రాంగుఁడై
మోదానందము నిర్వికారగుణసత్ఫుల్లప్రభాశాంతితో
గోదారణ్యసుయోగమండపమునం గొల్వుండు యోగీశు స
త్పాదాంభోనిధిఁజేర్చు నావికను సంభావించి పూజించెదన్. 40

ఉ. అంకిత మీప్రబంధమును నాగమభోక్తకుఁ బుష్పమాలలన్
సంకులు చంపకోత్పలతుషారపయోధరవర్ష ధారలం
గుంకుమపూవు కప్పురము గట్టలహారతి తేటగీతలం
గంకులఁ బాదపూజనముఁగూర్చెద మత్కులవృత్తవృద్ధికై. 41

క. వేదాద్రీశునకున్ సుర
పాదార్చనమర్మభేద్యబాణప్రగుణా
పాదిత దితిజాంతకునకు
బోధామృతనిత్యదాన పూజారతికిన్. 42

క. నిత్యానందమునకున్సుర
సత్యాన్వేషణసుధీశ సజ్జనభక్త్యా
దిత్యపరిబోధితాఘున
కత్యంత సునృత్యభూషణాలంకృతికిన్. 43

క. కృష్ణాతీరస్థునకున్
విష్ణుసహస్రగుణనామ విశ్వంభర సం
జిష్ణు పురుషోత్తమునకును
తృష్ణావర్జితనిరోధధీహృదయునకున్. 44

క. జ్వాలాయోగోగ్రమధుర
కాలాంతక నిమిష దృగసి కాంచనమణికిన్
నీలాళినయనభాస్వర
బాలార్కాత్మప్రభావ పాహితఘృణికిన్. 45

క. శాంతునకున్ వరగిరి వి
శ్రాంతునకుం బరమభృత్యసచ్ఛాంతునకున్
శాంతేక్షణ భక్తహృదయ
శాంతునకున్నారరూప సదృశాత్మునకున్. 46

క. దాంతునకు ఘోరరణ శు
ద్ధాంతునకున్సుగుణరాజతారక మంత్రా
ద్ధాంతునకుం జారణగా
ద్ధాంతునకున్సరసలోలతర రసికునకున్. 47

క. రాజీవాక్షునకున్ గురు
పూజావితరణ మధుఘునపుష్కరశయనాం
భోజహృదయ పద్మవసన
రాజపతంగస్వరూప రాజీవునకున్ 48

క. పరమాత్మునకున్నత్యా
కరశాశ్వత నిర్వికల్ప కల్పాంతునకున్
వరహేలాపుర వేంకట
వరదహృదయహంసరాజ వర్ధిష్ణునకున్. 49

## క థా ప్రా రం భ ము.

సీ. తరుశాఖలును లతల్ తాండవమాడుచుఁ
జదలఁదాకుఁబుడమి ఛత్రమనఁగఁ
గిసలయదళములఁ గ్రీడించు నీలమే
ఘచ్ఛాయఁగ్రాలు నాకసమనంగఁ
బుష్పగుచ్ఛంబులంబొదుగు రూపవిలాస
ధారణతారాపథమ్మనంగ
మధురసమునుజిలుకు మధుసదనముఁబోలి
ప్రజ్వరిల్లెడిచంద్రపథమనంగ
గీ. మేఘములఁదీప్తి గజములుమించి తగులు
కుంజరోధ్వాంతమధుదానరంజనములు
వసుధ వర్ధిల్లఁగగనంపుఁ బందిరియన
దండకారణ్యము ప్రభను ధరణివెలసె 50

గీ. బాలశార్దూల మత్తేభ ఖేలనములు
వ్యాఘ్రభల్లూకసంవాద నాద్యములును
శుకసుశారికాసుకవన చోద్యములును
బ్రబలి హృదయాంతరాళముఁ బాయవెపుడు. 51

గీ. వేధవారణకుంభాబ్ధి వేదనాద
మధుజలప్రవర్ష విభవమదనగరిమ

పుణ్యజన సమార్హ్మజలపరిపూజ్యబళిర !
గౌతమిప్రబలు భద్రాద్రిసేతుకతన. 52

క. ఆనదిదరినింగ్రాలెడి
పానవిశేషమహిమమున బల్లెపువేటం
గానము ఘోరమృగనినద
దానము జలఘోష మేకదంతునిఁగలచున్. 53

గీ. దండకారణ్యమధ్య నుద్దండతరుల
శోభనగృహములేలేని చూపుమీఱు
విద్యలేనట్టి మనుజుల విధిసృజించు
నగరమనుపేరు జెల్వొందు నాకగరిమ. 54

ఉ. ఎక్కడఁజూడ నెక్కువగునేనుఁగు గుంపులు రాజసింహములుం
జిక్కనమప్పి నక్కలును జెల్లనిపుంఖలు నెండమావులున్
నిక్కనకొండ్రమాకులును నిల్చినటేకులు ముండ్లగట్టులున్
మెక్కనకోఁతిగంతులును మీఱినపుట్టలు చోద్యమొప్పఁగన్. 55

సీ. పెన్నేటికాల్వల పీనుఁగుదిబ్బలు
సైకతరాసులై చతికిలఁబడ
మున్నేటిచలముల మూఁతలతీతల
జీవనదిమయమై సిరులుబెగడఁ
బొన్నేటిజిన్నెపి పున్నాగతరువులు
ముండ్లపొదరిటిండ్లు ముసిరినిగుడ
తెన్నేటియొయ్యారి తేఁటులమ్రోఁతలు
పుష్పాడమిట్టల పొలుపుదెగడఁ

గీ. బగటిబందిపోటుకుఁ దగువసతిగలుగు
పుండరీకము లేపునఁబుత్తెఁబట్టి

మట్టఁగనుఁగొను జాడలమాటకల్ల
నిశ్చలంబైన వననిధినిబిడగృహము. 56

చ. తరుగని వెట్టగొట్టులకుఁ దన్మిళితాంబులు చట్టిగట్ట నే
తరుణిమచేఁజిగుర్చు సుమధారణధాత్రిని మెట్టపల్లముల్
సెరిసరిఁజేయఁగారడవి నిల్చినమ్రాకుల భృంగశారికా
పరభృతభంగసంగమధువాసలతారత మీనకేతువుల్. 57

ఉ. భానుఁడుపోయు నాయుడుకుపాలనుమ్రింగిన ద్రిమ్మరీడు నీ
శానుని వెంటఁజూడ ఘనశాంబరిరూపళి చంద్రికాబ్దముల్
కాననిధాత్రి కేవిరులు కాంచనఖండన మిత్రశోకముల్
తేనెలరాల్చుకాననము తేఁటులమాధురి మచ్చుపోతలన్ 58

క. ఆనగరిబాలికలు ను
ద్యానవనమ్ముల మధుజలధారల బల్మిం
గానుక శారికగీతల
నానికుసుమసాయకుఁడస నలరెన్మిగులన్. 59

క. కుసుమశర వేదనకలిమి
కసఁగనివ్యామోహమునను బరువులిడంగన్
మసలకవనమున భాసిలెఁ
గుసుమవిభవవనలతాంతకుంతమనంగన్. 60

క. స్వర్గమునఁ గనవు పెరుగదు
దుర్గముల నడుమగరికకు దూరుదమంచున్
భర్గరహితగోవులు పుర
వర్గపుగోపాలుని గుడిపంచను డాగెన్. 61

ఉ. పచ్చని మేఁతమేయుచును వాకిలిజాడను బట్టకుండఁ బెం
పెచ్చు కరీంద్రగంధముల నీదుచు గోవుల జాడవెంట సం

దిచ్చు ప్రమోదలాఘవము నిచ్చలుఁదేలుచు మూపురంబుచే
నచ్చుపడంగ నంకులను హాస్యముసేయవె దూడలాననఁగన్. 62

చ. జలములమీఁది ప్రేమమునఁ జందనపంకవిలేపగాత్రముల్
జలధరఘోషరూపగుణసామ్యము వెన్నునునంట దున్నలా
జలజసుమిత్రపుత్రకుని శ్యామలవాహనమా మదంబుచే
జలగజమత్సరంబులను జచ్చిన పాములఁజేసె మాటికిన్. 63

చ. పులులు విరోధమూని తలపొన్నలనీడను జెర్వునీటికై
పలలముమీఁది కోరికను బాసలనోటిని ఘోషవెట్టుచుం
జలనమునొందు గోవులను సత్తువఁగూడను వక్కలించుటన్
మలినములేని నాయకుఁడు మన్ననఁ దోకనుబట్టి యాడెడున్. 64

క. మంత్రముమాటకు లోఁబడు
తంత్రజ్ఞుల యాజ్ఞను బులిదలఁదాల్చునదే
యంత్రబల సహనముఁ దెలుపు
మంత్రము నాయకునిచేతి మచ్చులజాడన్. 65

చ. తరగని దుంగలంగుదిపి తట్టుచుఁ దీర్చిన చిత్రకూటమున్
మురిగిన బండిచక్రముల మొట్టిన సమ్మెటవాలు వేటుచేన్
స్థిరమగు బండ్లచేతనము శిల్పపరీక్షల నిగ్గురాల బె
గ్గురమగుమంట కమ్మరపుగొల్మి విభూతి నెఱుంగఁజేయుచున్. 66

గీ. పూలబంతుల జంటల పొదరుటిండ్లు
చంద్రకాంతల చంపక సంగమములు
మల్లె మందారపూవుల మధురసములు
తగిలిపాయవు గృహలక్ష్మి తాండవింప. 67

క. అరుగులులేవు తలతరుగు
మరుగుకరువు చతురశూన్య మహిమంగ్రాలన్

వరవిశ్వకర్మ చేసిన
వరికుప్పలనఁగ గుడిసెలువర్ధిలుచుండెన్. 68

క. పాచిమొగము సురపానము
దాచవెరచుదుంపలఁదిని తాకునుబులులం
గామవిలుగూడదాల్చిన
గోఁచీపాతలగువారు కోయలుగారే. 69

క. మమకారములేఁ గొట్టును
నమరవిభవవర్తనగల యార్యుని జేయన్
శ్రమపెట్టెడి బడిపంతులు
యమదండధరమదనేభుఁడగుచుం గ్రాలెన్. 70

ఉ. ఆవనవిప్రనందనుని యార్భటిగుఱ్ఱము మీఁదనెక్కియే
పోవునుదద్దినంబులకుఁ బూర్వులపద్ధతి మించిపోయె మా
యావులయిండ్లితద్దినము లన్నిటికొక్కటి మూలమంత్రమై
తావులఁ గావుకావుమని దక్షిణలాగును మత్తకోకిలై. 71

సీ. సురతరణ వినోదశుభములఁ గూర్చుమో
ఱుప్పని దురఁగొట్టు తప్పఁబట్టు
సారానుకూటము సాధించు తరసతో
మాతంగసంతతి మదనకేళి
అరుణార్కబింబ వితరణ స్వాధ్వసమిమ్ము
విషధరపటలము విటులఁబోలి
యుద్ధతనాట్యము నొనరించు సురనాట్య
వేశ్యాంగనలనండ వెంటఁబట్టు
గీ. మాటలాడఁగ ముత్తెముల్ నోటఁజారు
నుత్తరంబీవు లలితాంగి యున్నతోక్తి

తాళవృంతఘాతక ఖడ్గధారబలిమి
మనసునిల్పి లెక్కఁగొనుము మహితబుద్ధి. 72

సీ. సుమనఃపద మలినభ్రమరమత్సరమాదొ
ఘనగగన లతాంతకాంతిఁ గూడి
రాజతారకపతి రాగవిహీనము
పరదాస్యహస్తార్తి పాణిపీడ
శివపదము మరుగుజిక్కెపోయె లతాంగి
ఘనరసపోషణకానలేమి
సురుభారకదళిపురోదిత రసకూప
మేటిమిన్నలకడ మెఱుఁగుదిన్నె

గీ. పుష్పధామవిహీనము పురముసొత్తు
ధరలసమబాణఘనదానదండధరము
వెలను తగ్గించి యిత్తువో వేగలెమ్మ
టంచు మర్మోక్తులాడుదు రచటి విటులు. 73

చ. పదములు పంకమున్వరచువాయువిమానముఁబోలు కాళ్ళను
న్మథగజకుంభమున్వలచు నాభితలంబును నడుమ్మసన్నమా
సదనముఁబోలు వక్షము విశాలభుజంబులు కోరమీసముల్
వదనము దున్నరాతు సరి ప్రాకటదేహము మోటచూపులున్.
వదలవు రెడ్డివంశమునఁ బుట్టిన గోకులరామిరెడ్డినిన్. 74

ఉ. గోకులబృందవర్ధనము గోవనరంగము గోధరాబ్ధముల్
గోకనదంగదండములు గోపురహర్మ్యతటాకచక్రముల్
గోకలమాంకురాప్తములు గోఫలదాయకధర్మకల్పముల్
గోకులనాధవర్ణములు కొల్లలు పాయని తృష్ణవారముల్. 75

గీ. సకలధాత్రీవలయ మేకచక్రముగను
రాజ్యపాలనఁజేసి ప్రపూజ్యులైన

రెడ్డికులమునఁబుట్టిన దొడ్డచెలిమి
ధరణిఁదొల్చెడి బలరామ ధారుఁడయ్యె. 76

క. చక్కనిచుక్క పలుమణులు
చెక్కినకుందనపు బొమ్మ చిక్కననడుమున్
నిక్కిన కుచబలమున సొం
పెక్కిన లచ్చింబనుగని పెంకిలియాడెన్. 77

సీ. నీలద్రుమాకృతిఁబోలు కేశంబులు
భృంగసంతతవాసరంగమయ్యెఁ
జంద్రబింబముఁబోలు చంచలాక్షిముఖము
సురలమృతముద్రావు సొబగుమీఱెఁ
బర్వతములఁబోలు వక్షోజములు నీల
మేఘములాడెడి మేడలయ్యె
రంభోరుసంగమరంగమువార వి
లాసవివాద విలాసమయ్యెఁ

గీ. దామరకొలనఁబొడమిన ధన్యలక్ష్మి
సుందరాంగ చంచలధనశోధనగిరి
యై తనదు పొత్తునను నీడయై తనరిన
తరుణి యర్ధాంగిగాకున్న ధరణిఁగనునె? 78

గీ. నలుగురుకొమరు లిద్దఱులలనలఁగని
యశ్వగోమహిషాజాది యంత్రబలము
వశముఁజేసి పూఁదోఁటల బాలికల క
రణమిడి పుడమిమన్నుచు రాముఁడుండు. 79

గీ. ఇంద్రధనువు చేతనుబట్టి యింపుమీఱఁ
బూర్ణమేఘాశ్వములనెక్కి పుడమికొఱగు

కళలతో రెడ్డియశ్వశిక్షులఁగరపుచు
ధరనుపేంద్రుఁడో, యనఁగను బరగుచుండి. 80

నల్లని దేహముతోడను
బిల్లనగ్రోవిని గుదుపుచు వేడుకనాలం
గొల్లగఁగాచెడి కృష్ణుని
కల్లలగోపన్న దేలి గళ్లంజూచెన్. 81

కులుకును బంకముచిలుకను
గలువలశత్రువిశరములఁగరఁగుచుదోయుం
బలుతాపులనలక దినుప
శిలఁబోలు మెఱుంగుదున్నఁ జెన్నుఁడుగాసెన్. 82

ఆకులశనమడవిఁ దిరుగు
మేకలమందలఁగదరుచు మేఘాలాపం
బాకంపు రాగవర్షపు
రాకకుజనములుపొగడిరి రంగారెడ్డిన్. 83

పూలవనమున నుదకముఁదూలఁబోసి
బలమగు నెరువుపోతలు కలుపుతీత
గరపుచు నాగకన్యల గరువమడఁచు
కళలఁ గ్రాలిరియువతులు కానసమున. 84

వరుసను లెక్కలేని పలువంతులుదీర్చిన బండ్లలోపలం
దరుగని పాటిమున్న భువిఁదట్టఁగ ధూమ్రము నాకమంటుచున్
వర రథసామ్యమైతనరు బండ్లబలంబున వైరి రాజులన్
సురరణరంగముంగవియు చోద్యపు భ్రాంతికి హేతుభూతమై 85.

అంతట వానకారుకవయంబడె వారణకుంభినీస్థలో
ధ్వాంతరణాంత మార్తిక నితాంతఘనాంతరగర్జగర్జితా

నంతలతానురంజక నిరంతరవర్షపతంగ వైభవా
క్రాంతాదిగంతజృంభిత శరాకృతశీతలవారి భూతమై. 86

సీ. వేల్పుతోఁ(?)వనునంటి పెనుగాలితాకున
ధరణిఁజారిన ఘనతారలనఁగ
గంధర్వయక్షుల కందర్పశరములఁ
బుడమినివ్రాలిన పూవులనఁగ
మిన్నేటిజలముల మేఘవారణములు
ధరణినింపిన కుంభ ధారలనఁగ
నర్కపరితాప సంపర్క భగ్నజలంబు
గగనసుందరిగ్రుక్క నగమనంగ

గీ. నాకసముబ్రద్దలయ్యె మహాద్భుతముగ
మేఘములుకమ్మఁసాగెను మింటికెగసి
పిడుగులుమెఱుపులు గలిసి పెనుగులాడఁ
గుంభవర్షము గురిసెను సంబరముగ. 87

చ. బెకబెకరాగతాళములఁ బేర్చినకప్పలకేమిచిక్కె? నా
చకచకలాడుతందనము చల్లనినీటిని బెట్టిపుట్టెనేన్
వికవికమాడిపోవఁ దగనిచ్చెన మబ్బులవానకోవెఁల్
బకబకసిద్ధజప్యములఁబట్టిన మీనులసఖ్యముండఁగన్. 88

క. వెస రవిశశిరూపులదరె
రసధారల బలఘన స్వరాజ్యవితరణాన్
విసికి భువియు నాకసమును
మసిబూసిన మారేడుఫలమహిమం గ్రాలెన్. 89

క. నువ్వులవిత్తులవర్షపు
పువ్వులు పుడమిని జిగుర్చు పుణ్యముగలుగన్

వవ్వారె ! గొంగళిపురుగుల
బువ్వాట నూరు తెగుళ్ళట బుట్టెను సువ్వన్. 90

క. గంటెల తొడుల జంటలు
నొంటెలమందల హారంగు నొరగుచునుండం
గంటికి నింపును గూర్చెడు
దంటులు మెక్కిన పిట్టలదర్పము జూడన్. 91

ఉ. చుట్టును నూలుసాళ్ళు మొలిజట్టును సుధ్యను గూర్మసిద్ధిచే
పట్టును నొక్కపట్టి సలువంకలనల్లుచు సాలిపుర్గు సొం
బట్టు విధంబు బేర్చుచును భావన జేయుచు మాటిమాటికిన్
గట్టిగ నెడ్లఁ గొట్టుచును గంటల నాగలి దుక్కిదున్నుచున్. 92

గీ. చంద్రమండలాంతర్గతసాంద్ర మధుర
మధురసజలకణపతన మహిమవైభ
వోజ్వలతగ్రాలిజొన్నలు వొరగిరాలు
జడ్డిగము ఫలతరురూపు జల్లిడాయె. 93

గీ. నీలమేఘతరంగముల్ బోలుకురులు
చందనపుఛాయ కలువల మందకొలను
పద్మదళములముఖకాంతి పరిహసించు
నగరలక్ష్మిశిఖను బట్టు పగడదంప. 94

క. సరుకుల కీవిని బెరగిన
గురికండల మొక్కజొన్న గున్నలపొట్టల్
సురమౌక్తికముల గూర్చిన
బరికేతక సుమదళముల పరువునగ్రాలెన్. 95

గీ. పాటగుట్టలపోగులు బయుటచిమ్మి
పంపుదుక్కిచాళ్ళవరుస నెంపదున్ని

కుల్యాజలములు కేదారగుహాలనింపి
మొక్కగట్టినవడ్లను మునుఁగఁబోయు. 96

గీ. అంగనాసమాగమరమోద్యానవరత
టాకసవిధసముజ్జ్వలాస్తోకఘాస
మన ననంగోజ్జ్వలారామమట్లు గ్రాలె
నౌర! కేదారమున వరినారుపెంత. 97

చ. చెరువుల శోభనంబులకుఁ జేటునువచ్చిన వచ్చుఁగాక! నా
పరమదయాకరాజ్ఞలను భాసిలుమళ్ళను ధాన్యలక్ష్మి కా
పురమునఁగేళిసేయ నగుపూజ్యతగల్గుట నందికేశ్వరా
దరమునఁ గారుదున్నలను దాతలదానము రిత్తవోవునే! 98

చ. తిలకములేనిముంగిటను దెట్టులుగట్టిన మళ్ళరొచ్చులోఁ
బలకలుదీర్చి దువ్వనలవాటున వేణిని పెద్దమట్టలం
బులుముచు నీటఁబెట్టు వరిమొక్కలుజమ్ముమ్మన నాక్రమించునే
వళమున లచ్చినెత్తిగుడిపచ్చలడండలపేరు శాలినాన్. 99

గీ. కోశికేశభూషితపుష్పగుచ్ఛరుచులు
కంమకక్షురిత కుచసంగ్రామకళలు
పంకజమిళితజఘనశుభకరకరులు
కంతుకోన్మాదమానాటు కాముకులకు. 100

చ. భరితనిజాంగబింబపరివర్ధనతేజము నుప్పురాల్చ నా
తరుణవిలోకమిత్రుఁడమిత ప్రియుఁడయ్యెను దుక్కిమాని నె
ద్దరుతనులాగి చెమ్మతడియంకిలిఁదున్నుచుఁజింతచెట్టు నీ
డరుపునఁజద్దిటోగిరమునానుచు నిద్రను గల్వరించుచున్. 101

చ. తలకలిజుట్టుకట్టెసఁగ దండుల కొండలు కౌనులోఁబడం
దొలకరి పాటుపాటలను దూలుచుదండలఁగూర్పు నేర్పునన్

సలిలములోని పెందరులసంమున మొక్కలుబట్టి గ్రుచ్చుటల్
లలనలు పూవు మొగ్గలను లాలనగూర్చుసరింబడుంగనన్. 102

మ. చలియుం గాలియుఁగంటికింపొసఁగ సత్సాంగత్య కౌతూహలో
జ్జ్వలతన్ వీడిన కేశకుంభములు వక్షఃక్రాంతకుంభాళిపైఁ
గలయంగాయజమానరంగ నటనాక్రాంతానిలావేదనల్
పొలయన్ యల్కలుదీరి దంపతులు సంభోగేచ్ఛఁబారీణులై. 103

క. దినకరు వేపిడి మొలకల
మనవివిని కరుణచిగుర్ప మానసంబయ్యెన్
తనరాష్ట్రినియామకరస
వనవర్గభరణనిశాద్రి బంధునిరాకన్. 104

క. చందనగర్భితశీతల
మందగమనశీతకిరణ మధ్యమసీలా
నందకళరజితనిర్మిత
సుందరపాత్రిగరుసలి చుక్కనుదూలున్. 105

గీ. రామలచ్చాంబ సమ్మేళ కాము కేళి
మందరోన్మదితానంద బంధవైర
సంగజనితము భరిత నిజాంగబింబ
పతనసూక్తిగర్భాగార భారమడఁప. 106

గీ. ప్రళయమార్తాండజృంభిత భాస్కరవర
కిరణహేళిపరంపరమరణకాల
శీతకిరణామృతాంశుమై పూతమంచు
బిందుమౌక్తికరాసులై విరిగిపోయె. 107

గీ. గౌతమవర సంధ్యారాధకాలమందు
భైరవ కుక్కుటనాదము నరుణుఁడదరి

మేఘపసంపలి తోలకరి మెఱుపుభంగి
గగనధరతమసంబాగి పొగరుదీసి. 108

ఉ. ఊరువులంటఁగట్టి కడు నూర్ధ్వపదాగ్రసమాధినిష్ఠ శృం
గార రసోదకంబులను గాముక హేతుక పర్వతాగ్రసం
చారముసల్పు నిక్కుచును జన్నులఁ జేతులఁబట్టి నేర్పునన్
సారముగుంజు బాలకుని చాతురికాదనఁ బాలుబిండుతన్. 109

చ. స్థిరమగు పొత్రియ్యముంగిటను దీరగు కుండను బెట్టి కట్టెలన్
సరగునఁ బేర్చి మంటపొగసందడి పెంపునఁ గాగు నీళ్ళలో
మరగిన బియ్యముంగడిపి మంగళతూర్యకుతర్కగాన సం
బరమునఁ దెట్టుగట్టిన సిబాసగు గంజినివంచి దించఁగాన్. 110

క. సూపసతీమణిభూషణ
రూప, సుశోభోపవేషరూఢోర్వశినా
నేపుగవీడిన రవికను
దాపనివారణ సుభోజ్యదాతనుగూడెన్. 111

ఉ. కూటికిరోసి కష్టమగు కొల్వుఘటింపుచు నాలిఁబాసి పై
పాటుకు రాత్రివేళలను బస్వులమేపుచుఁ గోడికూతమై
పోటుకు నెడ్లఁగట్టుకొని పొంగుచుఁ గిట్టనుతోలుబాకొనన్
మాటికిముందు వెన్కకునుమల్పుచు లెంకలుమోటదోలుచున్. 112

చ. సరగునఁబార చుట్టములు సంచుల నోటినిజారు నీళ్ళలో
మరుగునవారు దోయ్యలను మల్చినకాల్వలఁ జుట్టమొక్కలన్
నెరపిరి కాలిపోతలకు నేవళమొప్ప గజేంద్రకర్ణచా
మరములమించుఁ బూర్ణసరమత్సరభోగముఁదుత్రిళ్ళ జేయుచున్. 113

ఉ. కారముతోడఁబుట్టి పులుకంచెల నీళ్ళను బచ్చుబారి హం
కారవితోషమత్సర వికారవిరాజ వివర్ణనాశికా

కారము నావహించి తొలి కాపుకు నూరెను మీర్పకాయలై
సారెకు మేకపెన్కచపుసామ్యము చూపులకిందఁ జేయుచున్. 114

— సూర్యవర్ణనము —

చ. రవియనుదివ్వె కుంకుమపరాగవిలేపసుతీక్ష్ణదృష్టితో
దివిభువి నిండఁగట్ట నిశిదేవత లక్ష్యమురూపుమాప నా
నపులు సుఖేంద్రనిద్రఁగని నాట్యవిహారముసల్ప రుద్రుఁడా
భవహర ! పుట్టె వేకువను ప్రస్ఫుటఘంటికఁగొట్టుయంత్రమై. 115

చ. రవియను యంత్రరాజమదరాగవివర్జిత భీమతేజుఁడా
భువిఁగలఁ బ్రాణికోటి వరభూషిత చండతరాగ్ని పాలుగా
భవవిభవాభిరామగుణ పైత్యవికారవితానసంధితో
దివిదరి కేగిపోవునటు తీరగుచందురుని యండఁజేర్పఁగన్. 116

— చంద్రవర్ణనము —

చ. జగతికిఁగన్న భాస్కరుఁడు జ్ఞానసుతీక్ష్ణుఁడు సాగిపోవఁగా
గగన నిశామణి ప్రచురగర్భిత చందనపూర్ణచంద్రుఁడా
ఖగపికమర్మగానరతికంతుకచాతురి పిక్కటిల్లఁగా
మగువగురాత్రిదేవతను మర్దుచుఁగాంచె నుడుప్రసంతతిన్. 117

శా. ఘోషాకారవికార! శూలధరసద్గోష్ఠీ శిరోభూషణా!
రోషోద్రేకవిషాయితాఘఘన దర్పోపేలూకతిర్యఙ్ముఖా !
వేషాడంబరదారుణాంధ మదనాభీలోలు గీర్వాణ వా
గ్భాషాగర్వమడంచు చంద్రి రణకూపాంభోధి పాల్సేయునా! 118

చ. బెదరుచు సర్పరాజములు వేడుకగాలిపటంపు టాకృతిం
గదలుచుబంభరోరు రసకంటకగాన వికారభేదనన్
వికళితనీలరాగ ఘనవిప్లవకారక 
కదళులతోఁపులంగదిసి క్రాగుచుఁ బొత్తెను  119

చ. కీచకసుందరాంగనల గిట్టనివేడుక కౌఁగిటిండ్లలో
దాచినమొక్కజొన్న కలుదంటులకీడ్వడు మూఁగచెర్కులం
జూచినవారిబిందువులు చోద్యపువిందును గల్గఁజేయఁగాఁ
గాచినకాండసారము వికాసమునొందక పూసిపోవునే ! 120

కం. కాడలపోంకము గలిగిన
చోడివనరమాసదనపు జోద్యముఁ జూడన్
వేడుక బాలురుగట్టిన
పాడుగురిగల విభవన శుభశరీరము నాన్. 121

క. సంతలశిరమునఁ బెఱిగిన
దంతులరూప మధుఫలవితరణహారణ ం
ట్కాంతుకవినోద లీలలు
చింతలుగలిగించుఁ బెఱిఁగిచింతలు మిగులన్. 122

ఉ. భూమికివేల్పుతోఁ గ్రిచకును బోరటతీర్పుకుఁ దాడినిచ్చునై
కామితకల్పవృక్షఫల గౌరవభారము విందుజేయసం
గ్రామముదీర్చునీడిగ విఖండుని బ్రజ్ఞమనోవికాస పూ
జ్యామలుఁజేసె యాతునరసంతతి మద్యమరాయబారమున్. 123

చ. జలనిధిచుట్టుఁదట్ట మడిసందునఁబండిన హేమకూటభా
బలమునవైరిరాజసుఖ బంధువిమాన వికారచేష్టలన్
మలుఁపగఁ బర్వతాగ్రమున మించెనుబంకజ బాణయోగమా
పలురణలీలకోటదగ బ్రస్ఫుటయుద్ధపు భ్రాంతిమించెమున్. 124

ఉ. మాటునుగూర్చుచెట్టు దరమానుష దారుణఘాతపాపమా
కాటనిరక్తపానగళ ఖండనజేయుట కెంచెనాత్మలోఁ
జాటుననున్న మానవుని సంగరహస్తగతాయుధార్తిమై
పోటుకుధర్మమందిరముఁ బొందెనువ్యాఘ్రము భీకరాకృతిన్. 125

గీ. చంచలఘనసిరి చెలిమిచంచలంబు
స్థిరతరభువి భారవివరక్షేమకరము
నాదిభూదార రూపమై యనుగుదెంచి
రామ కేదారలక్ష్మి విరాగఁజేసె. 126

క. కాననరాష్ట్రవిహార మ
దాననకుంజర సమూహాయశము నెఱయన్
దానవ గర్వవిభంగులు
మానవునితుపాకి గుళికి మాయంబగునే. 127

— కార్తుల వర్ణనము. —

సీ. రోహిణీమహిమము రోకళ్లపోటు మృ
గశిర శోభాంగము ఘననినదమ
ఆరుద్ర బిందుశూన్య మమృతంబుపునర్వ
సు కుసుమవృష్టిని జూరఁగొను
పుష్యమి యాహ్లాదపూజ్యము తడిపొడి
గూడి యాశ్లేషము కుంభవృష్టి
మఖ నరరాజము సఖగర్జితాన్వేషి
పుబ్బ రేగినవాడిపోకకసరు
ఉత్తర వర్షంబు హస్తి కీడుగరపు
హస్త సుసంగమాహంసముదము
చిత్త ప్రవాతము పిత్తము శ్లేష్మము
స్వాతి ఘనరసము శాంతిభూతి



గీ. మహివిశాఖానురాధలు మంచుఁగరపుఁ
గృషికవరుదృష్టి మిన్నంటు వృష్టిగురువఁ
ప్రథమశూన్యాంత్యపూర్ణాంబుపతనకేళి
ఫిసికితినుటకు మెతుకులు పృథివిఁగల్ల. 128

ఉ వంకరసన్నవడ్ల జడపట్టునఁ గూర్చిన తారహారముల్
పొంకముదీరి కంఠగతపూర్ణమదాంబులు చెమ్మరిల్లఁ గం
గంకణ ఘోరనాద రణకంటకచేష్టల సుందరాంగనల్
పంకజలక్ష్మిప్రాణములు బాపిరి తద్ధనకాంక్షితార్థులై. 129

ఉ. కోటికి గోట్లులై పెరుఁగు కుందనవర్ణపు టెంకుగడ్డి మే
స్మేటి నిశాకరోరు శశిమిశ్రమ చంద్రకరంగపల్లియై
మీటిన ధాన్యరాశి వడిమెక్కిన జింకలనాశనార్థమై
బూటకి మాయవేషరణపుంగవువింటికిఁ ద్రుళ్లి పారునాన్. 130

ఉ. కాయమునల్లమందు సవికారముపంకజగోత్రసత్త్వ సం
ధాయక నీలరాగమదధారణ వారణ రూపభోగ్యమై
మాయనిదున్నపోతుల సమాగమయజ్ఞ విధానతేజమా
పాయనికుప్పనూర్చెడి శుభంకరగానవినోదపాత్రమే. 131

చ. కరణము కర్ణశల్యజనకంటకహస్తవిలేఖకాండ ని
ర్భరమున మాడిపోయిన సువర్ణసుధాకర గోత్రహాళికా
తరులతిమత్సరంబున విదాహ విషాద సుభోగిదంష్ట్రి కిం
కరసవిశేషనాశనము ఖ్యాతిగ సల్పిన పోరువీడునే! 132

ఉ. న్యాయముసున్న ధర్మగుణనాట్యవిహారముకల్ల ఘోరమా
చాయరుబాధమెండు ధనసంపద బాలునిహస్తరేఖఁ బో
ల్బాయనుగన్నతల్లి ఫలలక్ష్మిని మ్రింగునుభూమిపన్ను మే
ల్కాయము కజ్జపోటుకుఁ గలాపమువింతగుమ్లేచ్ఛనాథతల్. 133

క. కన్నులు లేవు నరపతికి
మిన్నుల మధ్యంపుటండ మిన్నేరంటుం
బున్నమ చందురుని తోడుగఁ
గ్రిన్ననస్త్రీఖలసుంకగములంబీల్చున్. 134

మ. పరరాష్ట్రాంధ నిశాకళాభరణ వాగ్వ్యాపారమూర్ఖాప్తి సం
భరితానందశరీరపోషణము పాపారాధ్యసంపూజ్యమా
పరభాషా ధన పోషకాదరముఁ గూర్పంజూతురాశ్చర్యమా
నరభావంబిసుమంత లేనసురవీణానాద మేపారఁగన్. 135

చ. ఫలితము లేని తెల్గు సతిపల్కులఖ్యాతికి డబ్బు లేశమా
మలినము సంభవింప జనమండల ఘోషణగల్గు బెట్టు లా
ఢ్యులధనపోషణంబున రసోదయ మొందిన సుందరాంగనా!
కలిదరికిట్టి హీనదశఁ గంటిమి చోద్యము పొట్టకూటికై. 136

ఉ. సారము లేని మ్లేచ్ఛపదసద్ఘనపోషణ కాశఁజెంది సం
సారముఁ బాసి పట్టణవిశాల కళాసుర నాట్యశాల హం
కారము లుండఁబట్టి తమకంబుల నార్చుచుఁ బూటకూళ్ళ ఝూం
కారముకోర్చి పంతుల చకారవినోదము పాత్రుఁజేసితే. 137

శా. మాయామేయజగంబునందు నయధర్మాచారసంపన్నని
ర్మాయాసత్త్వమతావలంబులకుఁ గార్యాకర్షసౌఖ్యోల్ల స
న్మాయారాధిత విత్తసంపదలు నిర్వ్యాపారగోత్రాప్తమై
సాయంబేమియుఁ జేయకుండ నిడుసాక్షాన్మోక్షసౌఖ్యోన్నతుల్. 138

మ. వ్యవసాయంబు సనాతనాది జనవిద్యాసోమపానంబు పా
పవనచ్ఛేదన కార్యసంఘటన సౌభాగ్యంబు లక్ష్మీప్రదా
యవరోదీర్ణ సువర్ణ సూత్ర నవధాన్యాధారసామ్రాజ్యమా
నవబీజాంకుర కర్మదోలికల జన్మంబార్చి సౌఖ్యంబిడున్. 139

ఉ. పక్షులకాటపట్టు నరవానరసంతతితోడఁ బుట్టు స
ద్రక్షణఁ జేయు రాజుల విదాహవినోదము లుండఁబట్టు స
ద్భిక్షులనిల్వఁబట్టు కృషిభీకరచోరవరాహదండమా
పక్షములంటఁబొడ్చిన వివర్ధనమొందును గక్కుపోలికన్. 140

శా. వేదాంతార్థ విరాళకర్ణమణిగంభీరోగ్రదంష్ట్రాంతభా
గ్నాదాతీత హిరణ్యదానవ శిరోఘాతార్ద్ర రక్తధ్వజా!
పాదారాధ్య విధాతపుత్ర కృత డంబత్యక్తప్రహ్లాద స
ద్వేదాధీశ్వర కృష్ణవర్ణగిరి సద్విప్రాంధకారామలా! 141

ప్రథమాధ్యాయము.



!

శ్రీ

# కృషీవలవిలాసము,

## ద్వితీయాధ్యాయము.

క. పారాశర్యాజజ నుమ
కారసుతాంబగిరీశశుకమధురజనకా
ధార విరాగసుహృత్కమ
లారాధహరినరహరమహారూపనిధీ ! 1

### వృద్ధికార్యము

ఉ. రాముఁడు రాక్షసాంతకుఁడు రాగవివర్జితరాజ్యమేలఁగా
రామనరేశునామ సవిరాళశుభంబులు పొంగిపొర్లఁగా
రామవనాశ్రమాలయ విరామవిహారవరాహవానరో
ద్దామశుకార్భటోదరవితాన వినాశ విరాగ మబ్బుదా ! 2

ఉ. చీమలు గూడఁబెట్టినటు చేర్చినధాన్యము కొట్లకెక్కఁగాఁ
బాముల మూషికామర వివర్ధనరాజుల భాగ్యభోగ్యమౌఁ
దూముకుఁదూమునాఁగు సరిదుండగపుంబని కంఠహారపున్
ధామములన్ని నాశనవిలాస విధాతకృతాంతవిలాసచిత్రముల్. 3

సీ. రాత్రింబవలనక ధాత్రినేది తరుగు
లేదనక పెరుగుఁ బ్రోదిదనర
మేఁతనీళ్ళడుగక మేరుపయోధర
ప్రాంతములంటును బ్రౌఢిమెఱయ
సౌభాగ్యమొనఁగూర్చి సౌధాగ్రములనింపు

పూజించు నిర్మల పూర్ణతగుల
జాగ్రతాస్యా నిశాచరవృత్తుల
నెత్తణంచు జనని నింగికెగయు

గీ. పట్టి ధనముష్టి చలంచలయ స్వప్నసృష్టిఁ
దరుగలేని పడ్డిడబ్బు కంటిలీల
దేశముల నావరించు దిశలు వెలుఁగ
నగరరామ విధానము నలుపుఁ జేసె. 4

—♦ శయ్యా వివరణము ♦—

ఉ. బూరుగుదూదికర్పులకుఁ బూజ్యము పున్నమచంద్రబింబ మా
కారముఁ దాల్చి హంసరసకంతుకతల్పము నెత్తికెక్కి యోం
కారవిరామనాద ధనకాంచనశోభిత పద్మరాగమై
ఘోరతరాంధకార శుకకోకిలనిద్రకుఁ బాత్రమైతివే ! 5

—♦ రాట్నపు వర్ణనము ♦—

చ. కదురుకు నేకుఁ జుట్టి పలుగాకులదండను జేతమీటుచున్
మధుజలమాను తుమ్మెదల మత్సరగాన నినాదమేర్పడం
గదలకఁ బాఱ గుంజుచు సుఖంబవిధాత విచిత్రచక్ర సం
పదలనుగూర్చు రాట్న సిరిభాగ్యము భోజ్యము నేరికేనియున్. 6

గీ. ఊడ్పుఁ జెంతమున విరామమొదవుతరుల
గ్రామకాంతల శోభనారామలీలఁ
గరపుగేహరాజ్మోందిర మొరయుచుండు
సుందరులు వీణవాయించు సొబగుమీఱ. 7

—♦ తంతువాయపద్ధతి. ♦—

ఉ. మాలకునోటఁబెట్టు కవి మధ్యమపోషణ కాశఁజెందునా
సాలివిషాదమెందులకు సన్నుత దేవసుతాంగిరాగమ్మా

ర్ఖాళివిచిత్రలీల గుణకారముఁ జూపును చోద్యమయ్యెడున్
సాలిపురంగు తెర్గు ఘనచాతురిజూపును నేఁతలోతులోన్. 8

### శ ర త్కా ల వ ర్ణ న ము.

ఉ. పంకదురంతహంత యరిపాదము మేదురరక్తరాగిమై
కంకణశంఖ మౌక్తిక విఖండనబిందులు మాయమావెసన్
శంకరమౌళి రుద్రరిపుచండతరంగ వికష తేజము౦
బొంకముదీరి వాతశరపూర్ణజలంబులు తెల్విఁగాంచుతన్. 9

మ. వరసూర్యాగ్నిఘనాద్భుతార్థతతి శోభారంగకల్లోలమై
త్రి రసేంద్రాళితల మింటికంట భువిభృద్విష్ణ్వంగ మల్కింపసం
గరసందోహాశతాంగజంఘులతివేగంబారఁ దిక్ణోగుప్తిఁడై
యరవిందాత్ముఁడు దీచి కేగె దినకార్యాంతంబు క్షీణింపఁగన్. 10

### శీ త బా ధ

శా. పాతాళాంతర వారివర్గములు భీభత్సాంగ శూలంబులై
వాతాంబావృత శైలరాజినగ శోభాకారచంద్రామృతా
పాతంబై ద్విఘనీభవించు హిమసాంపత్యాది నైషమ్యసం
భూతంబై విదళించి మొత్తుచలి మాపుల్జోలఁ బాడించుతన్. 11

మ నగభేరీరవ రాజిమై పవనసన్యాసంబు చేయుండఁగా
జగతీచక్ర సుమందిరంబుఁగని వ్యాసానందమేపారఁగా
ఖగరాడ్హ్వంసమతంగ భృంగహారిసంఘంబేల వెంటంటవో
పగశుద్ధాంతపయోధరాద్రితమివిడ్వంజాల వేలాచలీ ! 12

సీ. చలిగాలిమలయాళిజడదారి నగరాజి
జలబింబితకుసుమ సంభవంబు
వనరాశి ధనరాశి పన్నగభుక్తతి
చంచల శరవేదసంగరంబు

మధుపానరసగాన మధుకరీసంఘంబు
జగడంబు పగడంబు సంఘటించు
విరజాజిసురదారు మరుగారుసురపొన్న
సరసరసాల వితరణకేళి
లలితలతాంగజాలక సురతాంతవి
శాలతాంతమదన చందనంబు

గీ. వృద్ధికెంపుసీమంతము వెన్కనుండ
వస్త్రహీనుని జేయుచు బ్రచురమహిమ
శస్త్రములఁబట్టి తట్టును సంగరహితి
సుఖవిరాగాంధకార విస్ఫూర్తిఁగొలుపు. 13

ఉ. ద్వారసమీప సేవకుఁడు దట్టినచేతిని నిద్ధినిల్చితో
వారిరసోదకంబు దరివల్చినయోగము భోగమేమియో!
ధీరత నీటమున్గు నరదిక్కరి జన్మలఁజూడనొల్ల వో
దారుణహస్త ముంజరచి తాండవమాడుదు జంకులోఁగొనన్. 14

—♦ వృ క్ష వ ర్ణ న ము ♦—

ఉ. మెట్టలసంచుజారి నలిమేనలమించిన జొన్నమొక్కలా
చట్టుల సంఘసంస్కరణ చందనశీతలవాయురాశి మేన్
బట్టఁగ లోహపూరిత సువర్ణజవాంగ విశాలమైమనెన్
దట్టపువారిపోషణ సుధాద్రవమారుత శీతభోగమై. 15

ఉ. బాలురనోట నుగ్గుగర్పంగను బొంగుదునుగ్గు లెక్కచుం
గాలవిపక్వమొందిన సుఖాళికిఁ బూర్ణపుకంఠఘాతమై
నాలితనంబు వేర్పఁగని నాగరికంబు వహించి యామదం
భేలమహాదుర్మ్మంబనుచుఁ బేర్వదుపిప్పలిచెట్టు లేనిచోన్. 16

—♦ పుష్కరమహిమ ♦—

ఉ. ద్వాదశవత్సరంబులకుఁ దప్పనిపుష్కర సత్వరాత్తతల్
ప్రోది మెయిన్సుఖాస్పద సుభూతజపాముల వేదవేద్యమా
వాద హితానురంజక సభస్థిత గౌరవపాత్రులేటికిం
బాదులు సాధువృత్తి ధనవాంఛకుఁ బొంగుచు దాసులై రిలన్. 17

క. నరులవిచలనము పూర్ణము
సరసాళ్యర్భట వినోద చాతుర్యంబుల్
సుర కిన్నర యక్ష సతులు
తరగనిసుకపొడిగాసుల తండంబయ్యెన్. 18

సీ. పశ్చిమాద్రిని బుట్టి పరమపావనసుర
త్యాగమభిలషించెఁదనివిదీర
గుట్టమెట్టల కాటపట్టయి విషధర
పటులపాటుగగొన్న బాలమిన్న
యాంధ్రద్రవిడకన్యఁ కొండను విడునక
నేతెంచుసిద్ధాద్రినిర్మలాంగి
నాసికపాపనివాదసంగరము న
భద్రరాజనగరులద్రులయ్యె

గీ. తరుగులేని తరంగము లొరసిపట్టు
అరుణజలములపొంకునునుడఁబట్టుఁ
దరణకేళిఁ దేల్చుతరుణికరుణబుట్టు
మరణరాహిత్యసుఖములమరుగుగుట్టు
సరళగోదావరోదక సంగమావి. 19

ఉ. త్రోవలబండ్లు నప్పుటలు దుర్ఘటనకాననిఁ పూనిక చేతనా
తావులయొద్దనగ్గిగల దట్టపుటోపులు కీలుబొమ్మలై

శివిని పొదులై పొదుగు టెక్కెములంచును భీతిఁజెందకా
పావులు నాట్యశాల ఖరబంధురరక్షక దీపములున్నవిరా! 20

శా. పాకీదోర్లసుబాహులుండఁగల సభ్యస్త్రవ్య సంఘంబులుం
గోకారాధవిధానగానములు శుష్కోద్దామపారంగతుల్
వాకిళ్లండనుబట్టిపోవుఘనశోభవ్యాప్తినాంధ్రోద్యమం
బేకంబై బలుదొడ్డనేర్పునసుఖోన్మీలంబుగూర్పందగెన్. 21

శా. లాభంబేమియు లెక్కలేనిపినవాలంటీర్లు పంతంబుతో
శోభాలంకృతమానముద్రిలను నౌత్సుక్యపరీణా దార్ఢిచే
నాభీలార్తినిగుండు మానవులవీణానాదమే పారఁగా
సౌభాగ్యంబులనెప్డుఁగూర్చిరిల పేరిక్షుప్రాంధ్రి యోపాళికిన్. 22

## —♦ ఫలతరువర్ణనము. ♦—

ఉ. తెమ్మెర తేరిరాతు ఘనతీక్ష్ణసుబాణము లెక్కవెట్టు చం
దమ్మున మించి శోభనముదాల్చిన నాసికభోగరాజికం
దమ్ములు హెచ్చునిచ్చు సురదండముఁబోలిన జామిచెట్టు ని
త్యమ్ము విహారకేళికి నిధానముచుంబనవర్గభూజమై. 23

ఉ. దోమలపోటుకేకలఁగి తుంగపయోధర ఛత్రిభోగియై
భామలశోభనాంగరసభాసుర కంతుకవర్ణపూజ్య సం
కోమలచర్మరాగిసని కోరుకుఁగానుకరోగనాశనో
ద్దామము వెంటవచ్చె జనతంత్రముబత్త యినారికేళియే. 24

క. రోగనివారణరసనా
భోగియటని రాజవైద్యభూషణతంత్రిల్
తూగికొనియాడలోహాస
భోగమునారింజలు జనహర్షముఁగూర్చున్. 25

ఉ. కబ్బముఁ గూర్చు పండితుని కంఠముదట్టిన పైత్యవాతపుం
బొబ్బలు శాంతినొందుటకు బుక్కటఁ గూర్తువు చంద్రకాంతపుం
మబ్బులు జారగొట్టు పసిమట్టలమొగ్గలు పండ్లగుండ్లఁ బో
ల్దబ్బలు మట్టగించుదరి దాగిలిమూఁతలు మొగ్గలాడఁగన్. 26

ఉ. చెమ్మలగుమ్మరిల్లు నరచిహ్నముకోర్వదు ముండ్లఁ గూళ్ళపై
కొమ్మలనండబట్టు గజకుంభరసోదయమర్దనంబుతో
సొమ్ముల వాతపిత్తకఫచూర్ణిత జాడ్యనివారణంపు భా
గ్యమ్ములఁ దేలు నిమ్మలహహా! లవణాంబు సుధాద్రవంబులే. 27

ఉ. మిక్కుటమైన భోగము సమీరపరాగము కాంచనాంబరం
బెక్కి తదీయపల్లవ మహేడ్యరణేభసుహస్తవై రమున్
స్రుక్కుచు నాలిఁ బాసి క్షణమృణ్మయభోగముఁ దాల్చెఁ గాని చోఁ
జక్కెర కేళితీపు సురసాలము హత్తక మిన్నుముట్టునాన్. 28

క. చేతోభవచపలాస్త్రవి
భూతిని వెలుఁగొందు జననిపూర్ణాస్రిదిగం
తాతాంతశోకబీజము
సీతాఫలమై వెలసెను సిద్ధులజంటన్. 29

క. సీతాఫలవనబంధుర
పీతాంబర ధరవనచరవీక్షణతాపో
పేతోష్ణజలనిలశమన
వాతని గూఢ నయనాంకఫలలతలీనన్. 30

ఉ. తీలగు టేకుమ్రాను వనదిగ్గజరాజము వర్ణపాత్రమా
దూలము రంగుమీఱి పురదుర్గములంటును గేహికాగృహా
న్మీలము సంఘటించు సుఖనిర్మలనిద్రకుఁ దూగుటుయ్యెలా
బాలవు పార్థసారథి విపర్షసభూజము హాహిసీరమా. 31

చ. క్షితిరతి తోటకూరలతచిహ్నము సద్విజరాజమండలా
గతజలసేతుబంధన సుఖాసనబీజము కత్తిపోటుకుం
మతిచెడి రాలిపోదకట! మంజులలోహశలాకభూతమై
జితరిపుశాఖరాజ నరజిహ్వనుగోల్తువు ప్రాణదాతవై. 32

ఉ. మారుతపానభోగ్యహిరమాసుతుఁ డూరులఁదేలియాడఁ గం
గారువిశాలపుచ్ఛవిలసద్విషపూర్ణ సుసృష్టిఁజేయునా!
వారివిభూతి కోమలసుబాహుల భోగులపొట్లకాయలం
దారిచి విశ్వమిత్రుఁడు విధాతవిధానము మ్రిగ్గువెట్టఁడా! 33

క. కరుకులకళ్లిమురీతిని
మిక్కుటమగు బాధఁగూర్చు మీరిన హారికిం
జిక్కులఁగూడును హెచ్చిన
చిక్కుడుకాయ యెనుపపులిచెలిగుగ్గిళ్లే. 34

క. పందిరితీగలఁ బుట్టిన
మందిరపోషణ రసజలమంజులశోభా
సుందరకోమల బీజము
చందనగర్భితము బీరశాంతిని గూర్చున్. 35

క. భీష్మప్రతాపకలిత
శ్లేష్మవికారగుణశోభి శ్రీకరభూతిన్
గ్రీష్మర్తువు నెటుబుట్టితి
శుష్మంబగు బెండకాయశోభనుమీఱన్. 36

ఉ. గుమ్మలఁద్రిమ్మరీడు గడుఁగూళలతీగలగట్టు నీడఁదో
రమ్ములనూగి సారసపరంపరలై మదగర్వభోజనాం
గమ్ములఁగ్రాగి భంగగజగామిని కుంభవిశాలపూర్ణమై
కొమ్మలజోగి చూపలగు గుమ్మడికాయలు భర్మదీపులే. 37

చ. బలమగు గట్టితోఁపుగని పందిరిమింటిని వెన్నముద్దలే
ఫలములు విఱ్ఱవీగి మధుపంబుల మత్సరపీడనంబు ఏ
పలకనుమించు మోటసిరిఁబండిన భామలచేతఁజిక్క యా
వెలగల మన్మథప్రముఘునపిత్తముశాలికి తారుమారుగాన్. 38

ఉ. చీఁకటి బూచి తీగకను చిక్కులఁజిక్కిన కారుపుబ్బుచే
భీకరనీలకంఠరతిపీడనదుగ్ధములై మనస్సుధా
నాకజవారిపోషణ వినాశవిషాధిక కంఠభోగమా
కాకరకాయవాటము వికారము చేదును దీపిలేసిచోన్. 39

శా. వంకాయందము లేశిరోజముల దివ్యాకారసంభూతులో
షంకారాధమరాళకంఠధర సర్వజ్ఞాద్రిసేవాంబులే
హాంకారంబుల జంటఁబట్టి ఘనమోహానందశాఖాంగి యా
సుంకంబుల్ గుమిగూడిపేర్చు రసనాసూక్త్యగ్ల సంకీర్ణమై. 40

ఉ. మందిరనాకభోగమధుమాధురి కాకరచందనంబుతో
సందులపొందుగూడి నరసంఘముమట్టదు తీపెముత్తైమై
మందులచింతకాయ వనమాలికకూటము కోరికొన్న దా
పందిరిదోసకాయ పసపంతముజూపును గత్రిపీటకున్. 41

ఉ. సుందరిబృంద మింటిదరిఁ జూర్ణము జేసిన పెంటపోగులం
గందళితాంతరంగరసకంధర ధారల కందచేమలం
బొందుగఁగూర్చసారరసభోగి తటాకపుతామరాకులా
కందకులేనిదాదురదల్గునె చేమకు నెన్నఁడేనియున్. 42

ఉ. గంపలునెత్తిమూటలును గావిడిసంచులు బండ్లమీఁద గం
బంపులమెండుబండిపలుబంతుల కందుల బూరుగుష్మ్రలా
సొంపులపాడుసంతలను సుందరకుంభములై మనన్ సుఖం
ముంపగుబీరపొట్లరటిముంగిటి కాకరకందచేమలన్. 43

క. చారువిశాలభుజబలుఁడు
సిరివిభవనాభిరామసిద్ధుఁడు జంటం
బాఱును శాఖలసారము
జూరుమ భద్రాచలంబు చోద్యముఁ గూర్పన్. 44

ఉ. కూరలు రాశిరాసులయి కోటికిమీఱినగుప్పతిప్పలం
దారిచి ప్రోగుఁబోసినవిధానమునంబుధివాహినీ శుభా
గారముఁజొచ్చి పొంగువిధి ఖండములయ్యెను దానిఁబొందఁ బో
కారెనటన్నభీతికి మూఖంబులు ముప్పుటఁ దెల్పనై వడిన్. 45

ఉ బూడిదబూచివాచి శివభూతపిరాగము తీవెపోడు లో
పాడిరసోదకంబుల విపక్వముఁబొందితి గాపుచూపులోఁ
గూడిఘనీభవించి నలిగుమ్మడిఁ బోలునె తల్లకిందులై
గాఢతపంబుఁజేసినను కండబపొంకము భూతిఁబేర్చునా! 46

ఉ. నాయకపుట్టతేఁడు గణనాయకుపండగఁ జేయఁకోరిక
భూయనుబంధరాండముల పుక్కిటఁగూడిన తీయతేనె చ
ట్టోయని కొమ్మరోటికి తటాలునఁ బ్రాకిశశాంకమాధురం
బేయని రాత్రిచక్రములు బీల్చిన రీతిని మట్టగించఁగన్. 47

సీ. సారమున్వీడఁ దెల్లనై సగముగూలి
జారికల్లోల భర్తను జేరువిధిని
మధురసము నాయకునిచేతి మహిమసంటెఁ
దెట్టు పాతాళలోకము మట్టుకరుగ. 48

శా. మాతానాస్తి తథాపితా స్వజనభామాసౌఖ్యగేహాంగముల్
భూతాంతాంధవికారమత్సర సహాభోగంబులేశాశ్వతం
బేతీరున్నను గద్గదస్వనము పీల్చంగాలి ప్రాణాంతమా
భీతిందూలిన లేడిదండధర పాపిఁజోకి బోధించనన్. 49

## —♦ వ నా ట స్త్రీ వ ర్ణ న ♦—

మ. కలయన్ మోటగు చూపుఁ బెన్నులకకోకప్రోత్స వాత్తాంగనల్
వలయాకారము నేర్పుమీఱి జిగిలంబాడీలు నేత్రోత్సవం
బులఁ గూర్పంగటిభోగదంతమణి దీప్తుల్కలీక తోరంబులై
లతికాభూషిత మధ్యమానిసుడి గ్రాలంగాలినామాయమై. 50

## —♦ కొండపోడు వర్ణనము. ♦—

ఉ. నాయకకోయమాలికలు నాశనకౌతుక హేతుభూతమా
కాయలతేఁడుజోడు సుముకంతుక సద్విజధామ కాననం
బాయుధపాణులై మసలనద్దిర! చాకలిబండగొట్టుతా
పోయనఁబట్టుకొమ్మకలిపొక్కిలిగూల్చుట పానమూలమున్. 51

ఉ. బారెఁడుపోటకత్తి బలిబాధల గొడ్డలి మూలవేటుకున్
మూరెఁడుతాడజారి జలముక్కలుగార్చిన నీలకంఠముల్
జూరగఁబుప్ప సాయకుని చూపులవేడికి జాతవేదుఁడే
పారఁగపోడు శుభ్రఫల పావనతంగను రత్నగర్భమై. 52

సీ. శుకశారికావన శోభనఫలభోగ
రతులనిలనిలయ రంగపరము
పికగేయసముదాయ బిలగర్భకిసలయ
భోగదావాగ్ని పరాగపరము
మకరందరసపాన మధుగానసౌభాగ్య
నాకలోకశిరోజ కేకిపరము
గంధగజమదప కంఠీరవనినద
కోలాహల సగరికేళిపరము
గీ. సరళమార్తాండ దావాగ్ని సంగమంబు
ప్రబలవాతూల మలయాళిభంగకంబు

విష్ణుపదవిమాన చరణముష్ణమంబు
శుకమృగవిభోగనాశన శోభనంబు. 53

—♦ సంక్రమణవైభవము ♦—

చ. మధురసపానగానము రమాఫలదాయినిజూడ నాలిబో
తదనము చోరభోగము వితానసురాంతక భోగము న్సదా
విధిగలవేట మేల్మిదుర వేడుకపేర్చిన కోడిపందెముం
గుదురుగ సప్తదుర్వ్యసనకూటము శోభిలు సంకురాత్రికిన్. 54

సీ. కాలాహిపాతము కాలకూటమహత్తు
విషధర సలిలము వేటకెగయ
గోత్రభిత్కుక్కుట కోలాహలముభువి
మారుమ్రోతలిడుచు మంటలెగయ
మారుతపాశము మత్తకాశినుల హా
త్తంగానుదడబడి తపనమెగయ
శుచిభోగిజ్వరమున సోపానములకెక్క-
యరిబృందశాపము గరుపమెఱయ

గీ. ముగ్గులను బెట్టసాగిరిముదితలంతఁ
గోడిపందెములంగూర్చు కోటిజనులు
సతిపతులజంట కొలుపులు సరసగరిమ
భోగిచలిమంటలధికము తూగికొలువ
ధరణి సంక్రాంతివిభవము వరలుచుండు. 55

ఉ. కమ్మకుజోడురెడ్డి భువిఖండనచాతురి హెచ్చుమీఱు పొం
కమ్ములఁదీరు కాపుజలకంబులనారిన పంచజాతసం
ఘమ్ములు నిండి కొల్వనవకంబులుగూర్చును రంగభంగతో
గమ్ములు వేనవేలు కదరాగమభోగము ఖ్యాతిఁగూర్చునా? 56

శా. పాలేర్లంగలపాటుపోరలుడు సంపచ్ఛత్రుసంక్షోభమా
కాలాభీలవిరాముసాధశుకవాక్యప్రౌఢి బంధూకభో
గాలేమేలని కార్యహానిగరుపంగాఁజూచు సవ్వారిలోఁ
గూలంగాఁగదలున్నరీరమనుచుంగోరున్ ద్విజారాధనల్. 57

మ. లలితానందవితానసౌఖ్యముల కాలవ్యర్థజాలంబుచేఁ
జలనారంజక గాఢతాడనవికాశత్వప్రభాకారుఁడై
లలనా పాంగశుభాంగశోభితవిరాళప్రస్ఫుటాంకంబులం
గలయంజూచి కృషీసుకార్యముల పోకంబెట్టుసన్యాసినాన్. 58

చ చలనములేని స్థైర్యతరశాంతము భూమికిజోడుతాడియై
నిలుకడకొమ్మపోరడిమినిల్చిన నాగలిచెమ్మరిల్లఁగాఁ
గలమములంపుఁబండ మమకారముమాపిన కాంచనాంగమై
వలచినరెడ్డితీవ్రతకుఁ బావననామము రెడ్డిసీమనాన్. 59

గీ. పురుషవనితసహచరసుగరిమమెఱయ
బళిర! కేదారలక్ష్మికిఁ బరువులెత్తి
నవరసరుచిరధనములఁ గవయఁబొందు
రెడ్డిసీమయె సొంపొందు రేవెలుఁగన. 60

## —♦ మహాశివరాత్రి ♦—

మ. శివకళ్యాణవిహారభోగములు లక్ష్మీనాథగానార్హమా
భవనిర్మాలము కాలచక్రవిచలద్భాగ్యంబు శోభిల్లఁగన్
నవమాధుర్యవిరామ చైత్రసఖబాణప్రోత్సవంబొప్పఁగన్
శివరాత్రిద్దిర! వచ్చెఁ బాటుముగ స్వస్తింజెప్పు పాలేండ్లతోన్. 61

చ. వరరుచిఁగూడఁబెట్టె సురపాలురనోటికి మూఁతఁబెట్టె భా
సురరఃరాగలీల రససూచిత తక్రముచిల్కరించె నా

ధరనుత కామధేనువసుతాళము సారము మట్టగించెనాఁ
బెరపెరఁబొంగి పాల్కడలి బిట్టడఁగించు సురాళిపానమై. 62

ఉ. కోయకు భోజనంపురసకూటమినాయకు మంచివారి సం
ధాయునిగొల్లమాలలకుఁ దప్పులబుట్టకుఁ బిక్కటిల్లు భో
గాయతవర్ణ సంఘముల కంధతభోగము రెడ్డికాపుకుఁ
హాయువులారిపోయినను కల్లురు దీని మహాత్వమేమొకో! 63

—♦ మ ధు మా స ము ♦—

సీ. మధుపాంగనాసంగమమునఁ గాళించి మా
ధవుఁడు మాతంగమై ధరణిఁ గొదుగ
సురభోగకాంతను సూచించు మదనుఁడు
సుందరాకారుఁడై చూతమంటఁ
జంద్రికాంతనుజూచి చందనతిలకుఁడు
తారాపదముడిగ్గి తమినిబొదుగ
లతికాంత మదనాంతరతికాంత పవనాంత
చైత్రాంగ మిత్రాంగ సన్నుతాంగ

గీ. మధుమధురనినదంబులు మహిని వెలయ
సురుచిరలతలు శక్యమై చూపులెత్త
మధురిపుమదనశశిధర మాధవులును
బయలు వెడలిరి మదనదావాగ్ని గొలుప. 64

సీ. పర్ణకాంతలు వరవర్ణినీనీలాళు
లై చామరంబులు హాయువు కొలుపఁ
గోరకాననలు చకోరములగరిమ
నలరియర్ఘ్యమ్ము పాద్యమ్ము గరుపఁ

బుష్పవాసిని కలిపూఁదేనె పానార్హ
భోగముఁ గూర్చుచుఁ బ్రోదిఁ దనర
ఫలసువాసిని పరిపక్వరసాన్నము
పాత్రలవడ్డించి భవనమరయఁ

గీ. విందుకందుపొందు పసందు విరివిఁగరుపఁ
చైత్రరాజమదనహారి చెలిమిఁగూడి
ఋతువిరాగివసంత సురతసదనము
చోరకేళి మదనభోగవీరులైరి. 65

శా. తారానాథుఁడు వేఁడివేల్పుగు నిశాదత్త్రప పుష్పాస్త్రపూ
ర్ణారామాంతకశోభనాంగుఁడు జగత్ప్రాణాంగరాజీవమై
వీరావేశముఁదాల్చ మారజనకాభీలాంధకారోగ్రుఁడే
పారంగాఁ గొఁదువేమి మానవులఁగాల్పంజూతు చైత్రాగ్నివై. 66

చ. ఘనరసపూరితంబులును గాంచనరూపవిలాసగౌరసం
బెనయఁగ వక్రదారుణవిభేదకవృష్టికి దంతకాండశో
భనమును నారికేళవనబంధురకంతుకరాజభోగియై
మనిన రసాలభోగములు మాధవకుంజరపానగాసముల్. 67

శా. గంగాంభోరుగజేంద్రకుంభ రణరంగానందమాత్సర్యము
ప్పొంగంగావళి రాజబీజఘనకర్పూరంబు మైపూఁతగా
సంగాభంగజితేంద్రియాంగ మధుమాసప్రాప్తచిత్రాగ్ని దే
తుంగత్స్మాధరగోళమెక్కె పనసంద్రొబ్బన్వియాపాళునా. 68

చ. మధురసమానవర్ణ మధువాసరవాసము ముంగ్లమేను బి
ట్టుదురవికాసమొందితకటా! పనసా! నినుజూరి సిరిమై
కదలరు పైత్యమొందుటఁగుఁ గల్పితిసీనగు [illegible],
మదనవికారమత్తగజమందరమందులమారె [illegible]! 69

శా. సాయంవేళలఁజూతపక్వఫల ఘోషాధామచించా రస
స్ఫాయత్ప్రోషిత సూపపాయససుమాషస్తోమభక్ష్యోగ్రసం
ధాయాడంబర తీక్ష్ణభూషనసపిత్తగ్రస్తనాదార్భటుల్
హాయంబౌ ఘననారికేళరసరమ్యప్లీహా భోగంబునన్. 70

ఉ. రాజమహేంద్రభోగనిధి రామనృపాలవరాలయాగ్ర స
త్ప్రాజితశీలగంధరసభూషకరంద సువాసితంబు ఘో
రాజిదిగంతభూతగణనాంబుధి గౌతమికుక్షిలోపలన్
వాజికరంబుదూరి హిమవాతముజిల్కు కురంగిచందమున్. 71

మ. ఖరఘాతంబులకోడి విష్ణుపదమున్ ఖండించి భూలోకభా
సురపాశంబులఁజూచి శీతగిరివిస్ఫూర్తిన్ హరింపన్ సుధా
కరశైత్యాంగముదాల్చి ప్రాణధనభోగాలండనుంబట్టి భూ
ధరచక్రింబునఁ దాళవృంతమంబు సంతాపంబు చల్లార్పదా ! 72

ఉ. రాజమహేంద్రిపట్టణతరంగజలంబుల విద్యుచ్ఛక్తియే
మేజులఁగూర్చి దారుణసమీరణధామము పంచభూతమై
రాజిలఁ దద్బలంబు నరరంగమునూపితి బర్హిణీరమన్
భూజవిభూతివారణ సుభోగముపోల్చునె ప్రాణజీవినాన్. 73

చ. లలిత నిజాంగభూషితవిలాసిత చందనసారభోగ సం
కలితనవాంబుధారలు ముఖంబున ముత్తెపుకప్పురంబు పూ
తోలకరిసంగమం బగరుధూపము కూటమికౌఁగిటిండ్ల మే
నలమఁ దదీయతాపము వినాశనమొందదె శాంతిఁగూర్పఁగా. 74

గీ. పెరుగుతోటకూర ఘృతసూపరజిత వి
శాలపాత్రి మిక్షురసనిశాప్రిసేవ
వరశరచ్చంద్రికా రస పక్వదధివి
తానభోగముఁగూడమ తాపముడర. 75

ఉ. రామసుధాద్రివంబు చతురంగసమేతముగ్రోలఁబేర్చుమా
కామవిదూరులై సకలకర్మలసంధులు వీడిపోవఁగా
మామకపూజనీయ నరమాధవుభోగము పొందుగూర్పఁగా
నామమురూపుపాశము వినాశనమొందును దాపమారఁగన్. 76

## కిన్నర సేతు బంధన

ఉ. కిన్నరసానగట్టుదరి కిన్నరశోభనగానముల్ గనున్
వన్నెకుమీఱి నాట్యరసపాకము పుష్కరశయ్యనాటమం
దిన్నెలఁబట్టు వాయులతవిక్వతి బృందముచేత నాంశమై
కన్నెలుమీటు వీణరసకంధరభోగముఁ గూర్చువాణియై. 77

ఉ. కిన్నరసేతుబంధన సఖీజనసంఘము మేడలెక్కఁగం
గన్నులపండువన్నెరప్రఖ్యాతికిఁబుట్టిన మేడమెట్టులో
పన్నులబాధహెచ్చిన శుభంబులఁగూర్చును దాపదాహమా
తిన్నెలఁబట్టునయ్య యని దెల్పిన సేవకుఁజూచి రాముఁడున్. 78

గీ. సప్తసంతానములలోఁ బ్రశస్తిఁగాంచి
జీవపోషకధామము జెన్నుమీఱి
రాజనములఁగూర్చు వనవిరాజకార్య
భరణమగ్నుఁడౌ రాముని ప్రతినిజూచి. 79

ఉ. రాముఁడుకాడు సీరి బలరాముఁడు సీమసురాష్ట్రవర్య ధీ
స్తోముఁడు తారకాగణితశూరుఁడు ద్రావిడరాజ్యరత్న భా
గ్ధాముఁడు కుప్పుసామయరుతత్క్షణమచ్చటఁగొల్వు సేయఁగాన్
గ్రామములన్నిపొంగి జలకాండములయ్యెను నేత్రవృష్టితోఁ. 80

ఉ. దర్పణయంత్రరాజమున దక్షుఁడు గాఢసుదృష్టిఁగూర్చుకం
దర్పశరాసనాంచితవితారకనాథుని గుఱిఁదాల్చు నా

సర్వకభోగవైభవ విషాదము మించి రసాతలంబు భా
స్వర్గమడంచి రోదసిని దాకుచు బంధనజేయు నోయసన్. 81

శా. కావేరీజలపానధామ గుణభోగంబేమి చిత్రింపఁగో
జ్ఞానంబుల్గన మెంతు తీక్ష్ణసుమనో వాక్య-యదీజాలమే
గారింపంబై ఘనకార్యదక్షునిగఁ గూర్పం బేర్చు నేత్రోత్సవం
బే వారాశిని దాటిపోవ కలుగున్ హేకంబ సన్మార్గమై. 82

సీ. పాతాళజలముల పంతంబు వారించు
కంకరసున్నంబు బింకమరయ
గట్టుల గట్టుల గడ్డల భేదించు
పలుగుతాపీలసంబరము మెఱయ
భూదేవిలక్ష్మిని పూరించి తట్టల
గట్టులపట్టికి కళలదొరయ
నిసుకసిమెంటుపూయించి చేరాపిడి
దట్టంపుమై పూఁత తళుకు మెఱయ

గీ. కూలిజనములు గుమిగూడఁ గొదువలేమి
కలిమి తాపీలసందడి గ్రందుకొనఁగ
బండనలికించు వడ్డెల దండులుండఁ
బిలుపుపెత్తనములఁ జేయు పెద్దదొరలు. 83

ఉ. ద్వాదశవాజిశస్త్ర జవధారణయంత్రము ఖ్యాతిఁ బేర్చు భూ
వాదము బోర భూధరపువార్యపలానిల సత్వసంపదం
జేద వశీకృతంబులై చెన్నలరారఁగఁ జేతనాంశమా
సాధనపుంజముల్ గరపు శాశ్వతభోగము వానిచేతగున్. 84

ఉ. సైకతశైలరాజ వనసమ్మదశాఖల మాటుగూడి శో
భాకర చిత్రవహ్ని బడబానలవాదము లుప్పతిల్లఁగాఁ

చాకముఁ బొంది మట్టదిమి పానములూడ్చి విరాగిఁ జేయుచుం
దాకను దిన్నెలంబళిర! దట్టుచుయంత్రము ప్రాణజీవినాన్. 85

చ. వరుసను రెండుగోడలు సభాజనసమ్మతమౌ విధంబుగా
స్థిరముఁగసున్నముంగలిపి చేదినకంకరదిమ్మలెత్తగాఁ
దరుణులనీటితోడఁ గరడక్షతరాళ్లను మట్టగించుచుం
జరణవిలాసభోగముల సౌఖ్యముఁ గూర్చును మేడమెట్లతోన్. 86

ఉ. లోహగవాక్షభూషిత విలోకనచాతురి సూత్రభూత మే
బాహుల తాపుఁలంగడిసి భాసురరూపముఁ బొందుఁగూర్చె నా
వాహన చందనాలయ విపాకసమీరణముం దృణీకరిం
చోహో! యనంగభూతి విభవోజ్జ్వలమై మను కృష్ణలాకునాన్.87

ఉ. కట్టెడునాగవల్లి లతికాదళవర్గము నోటఁబెట్టఁ గా
దట్టపుబచ్చకప్పురపు తండము కుంకుమపువ్వు నవ్వు కెం
బట్టు కురంగనాభ మధువాసనమాటికి బుద్ధిమాంద్యమున్
బిట్టదరించునోయనఁగఁ బేర్చును దక్షిణభూతిఁ దెల్పుచున్. 88

ఉ. వేకువజామునె మధురవీక్షణజాలము లెక్కవెట్టు మా
యాకుల వేధనంబున విహారముసల్పుఁడు పంచపాత్రి కా
ఫీకలకండ పానకము వేడికిఁ దుర్నిళ్ళఁడు చారునీళ్ళచే
మార్కులఁబెంచిగొట్టు భువియున్ననలందును గష్టజీవినాన్. 89

ఉ. లక్షలరాక లేటికి విలాసము లేటికి ఖర్చుపెట్ట సం
రక్షితవాహినీ చరణరంగముజుట్టిన కొల్వుకూలు లే
భక్షణజేయు మాంసమధుపాన సుఖంబులకీవిజాలకే
యాక్షణమందె సీమలను హత్తెను రాముఁడు కూటిచెప్పకున్.90

గీ. కోయనాయకముఖ్యులు కూడి కూడు
మాని వేడుక వేడికాఫీని వారి

జూచి మరగి మరువరు వసుధ మధురస
పాకమున్మించెను దదీయ పానమహిమ. 91

క. సోడాబుడ్డులఁజూడుగు
వేడుకఁగూర్చు నినదములు విచ్చలవిడిగా
వీడుచుఁదారుడు బాధకు
మూడున దట్టపుమిణుకులుమంటన్ రాలన్. 92

చ. జలధరకుడ్యగోపుర విశాలసుధాకర ధామశోభనం
బులకు వినోదవల్లి వనభూముల మాలతవారిభోగ స
ద్ఫలితముఁగూర్చిబోచు పశుపాలురపాలిటి భాగ్యదేవతా!
కలమము లెండులేక తరిగాపులఁజేసెను బీడుభూములన్. 93

ఉ. తూమెఁడు విత్తనంబులను దొల్చిన భూములపంటఁ జూడఁగా
రాముఁడు జ్ఞప్తివచ్చు పలురంగులుమించిన మానికేసుమీ
చామలపంట దంపసిరిచందముపుట్టెడు చెర్వుమళ్ళ పం
టేమిటి దర్పపూరితపు బెచ్చులుమీఱెను దుక్కిదున్నకున్. 94

—॥ ధూమశకటవర్ణనము ॥—

శా. ధూమజ్యోతి రసోదకం బనిలసందోహంబు లోహాంచితం
బౌ మత్తేభపుయంత్రరాజమున దృగ్బంధంబు గావించి తే
జోమూలంబునఁ బ్రాణధారణము సంశోభిల్లఁ గాల్వచ్చురె
లేమాయాధిక పాంథుహస్తముల కేళీధామసంభోగమో! 95

సీ. వన్యాభరణసూనబంధుర ఫలములు
వారాశి దుర్ఘటవప్రిమొక్కఁ
గలమాంకురవితాన కాంచనతారలు
నానావనీసౌధనాకమొక్క
రసరాజసుఖభోగ రమ్యగంధజసూష

నీరాజనంబులు నిగిడి మ్రొక్క
నరవాహినీ ధరవరరాజ తేజము
ఘోరాజియాత్రను గూడు మెక్క

గీ. గుసుమములు వడ్లపరములు కూడిన నరుల
ద్వీపదేశముల దిశలు దీటుకొనుచు
ధరలు హెచ్చు కాంచనములు తరలఁ గూర్చు
ధూమశకటము సుఖముల దొరయఁ జేసె. 96

చ. బుసబుసరోయుచుంగదలు భూధరచక్రము కొండచిల్వ నా
రసజలధారలం బెరుగు రాగము ద్వీపములాక్రమించి భూ
కిసలయశాఖ పర్వతని కేతనతంతులు గూడి వెంటరాన్
మసలెడుబండి శ్వేతవిధి మాయకుఁ గూయని మోతలెట్టుచున్. 97

—* తంతివార్త *—

చ. కటకట ! తీగెగొట్టలుకుఁ గంటికిదూరము గాలిదారమో
సటనముఁ జేయు బెబ్బులిని నాదము వాయుమనో విమానమో
తటపిటముట్టునంత జలతా రలసీనుచు సీమ లేలుచున్
మిటమిటలాడు తంతురసమీనముబాకును మేఘమండలిన్. 98

ఉ. సైకిలు కాళ్ళ్ళతీతహరిచంచలభోగము గాఢతాడనం
బాకలిమూయఁగట్టు వృషభాంచితచక్రము మట్టిబండహా !
చీకటిబూచి గౌరవముచేటని యీసరసాళిదూలి భో
గాకుల సూరవర్యుల విహారము మోటరుకారుమీటుటల్. 99

ఉ లాగులు కుచ్చుటోపులవిలాసము కంటికినల్ల జోడు భూ
త్యాగముఁ గూర్చు భ్రాంతులవిహారము చేతిని మ్రోగు ఘంటికా
భోగము వెంటనంటు సతభోగసువీక్షణ తెల్లదొర్ల మీ
రేగిన నూత్నపద్ధతుల హీనత రేఁబవ లెల్లవేళలన్. 100

## — పత్రిస్థితస్థానవర్ణన —

సీ. తనఖాలు క్రియము తరుగులేసికవుళ్లు
తండోపతండంబు తగిలికొలువ
మరణశాసనములు మాంగళ్యభూషణాం
చిత నవరసములు చేదికొలువ
శ్రీభూక్రియమధన స్థిరతర శాసన
పత్రములువరలి భక్తిఁగొలువ
నేకకార్యనియమితేధిత శాసన
పత్రముల్మిగిడి పరముఁగొలువ
గీ. భువి తులాభారముగరుపు పూజమెఱయఁ
జేతఁజిక్కి నమ్రికులే చేదువిరుగు
పానకాలరాయలు తృప్తిపడును రెండు
గ్రామజన భూరితర సత్రరాజమనఁగ
భళి! రిజిస్ట్రాఫీసులు బయలుపడియె. 101

ఉ. స్టాంపులవార్తి మెండలీవిషాదముపత్రము తీర్గగొట్టుటల్
పంపులుకొల్లఁబోయి ధనభారముమోసియుఁ బూటకూళ్ళకే
ముంపులు చేతిరొక్కమనుమూల్గుకు మూకతసంఘటించు వై
కంపువశీకరైక నవకంబులు మాటలు తేనెలోయనన్. 102

చ. ఘనమగు మట్టివాఁడవర కాంచనపత్రము బేరసారమున్
జనగణనీయభోగగుణచాతురిమీఱిన వైశ్యధీరుఁడే
ధనమును గూర్చు శక్తిగల దక్షుఁడు పేరున గంగరాజు భూ
ధనగృహ హేమకూటఘనదంతులఁగూర్పును కోరుసంతలోన్. 103

చ. స్థిరతర భోగభాగ్యముల చిన్నముదూపము పత్రగీతమై
భరితవిశాలశాలివనమంజుల శోభనపూజ్యరాశియే

తరుణవిచారణీయ శుభతంత్రము సమ్మతముంచుఁ జెప్పఁటన్
కరలిఖితైకపత్రవర కాంచనరూప్యవిహారమే యనన్. 104

చ. ధవళవినోదపత్రము సుధాకరపాత్రము ముద్రిణస్థలిన్
రవివసురాజమైమసలు రాజ్యములేలెడు వాహనంబహో!
నవరసపూరితంబులగు నాగరకార్మికయోగభోగమే
భువిఁగనిపీడిపోదు ధనపూజ్యము నాణెము లన్నినోటులే. 105

చ శిరమును నేలు కేశములు చీఁకటికోనలు మీసముల్ వళీ
కరజనపూజ్యపాత్రమని కత్తికిదానము పాగజుట్టుటే
బరువని సన్నమల్లు సిరిపట్టెడు కోటీకిమూకలెట్టు నా
సరసుని తృప్తిఁజేయ క్షణశాశ్వతభోగము నోటుదాల్చునా. 106

ఉ. వానకుఁజీకిపోవు శిఖిపన్నగకీలల మాడిపోవు సో
పానము లెక్కఁ మానవుల బాహులఁబట్టియుఁ దారుమారులౌ
కానలకేగ చోరభయఖండనమొందని సీదుశక్తి ప
ద్మాసనకేళిభోగ సలిలాంబరబింబము చిత్రలేఖతోన్. 107

శా. యోగానందవిభాకరాంగజిత సంయోగాంబువాసోజ్జ్వలా
భోగాధారవిశాల వప్రనగసంపూర్ణేందు రాగోజ్జ్వలా
నాగాశేషశిరోగ్రతల్పశయనోన్మాదాంధ తీక్ష్ణోజ్జ్వలా
త్యాగాపాదితభక్తవత్సల విదాహార్తిప్రశాంతోజ్జ్వలా! 108

ద్వితీయాధ్యాయము.

శ్రీ

# కృషీవల విలాసము.

## తృతీయాధ్యాయము.

క. సురకారుణ్యా రసోదక
వరకాంచనరత్నగర్భ పరమపద సభా
కరపాపవినాశన మో
క్షరమానిలయ సుకృతజనసంగవిహారీ! 1

చ. సరళదశావతార నరశౌర్యసురాంతకనామధేయ సం
స్మరణవిదాహతాప తపమాధురిశాశ్వతభోగమోయనన్
వరలు ప్రతాపరుద్రపురవాసము వాసినిసంఘటిల్లె మం
దరధర ధూమకేతు పదధారణకార్యవిధాన శస్త్రమున్. 2

గీ. రయిలువేలైను కంట్రాక్టు రత్నఖచిత
దీపసౌధాగ్రభూషిత దేవయంత్రి
తాళవృంతసమీరణ తరుణభావ్య
తంత్రమంత్రిసంయోగము తలకుఁబట్టె. 3

ఉ. మేడలుమీఁదఁ గాపురము మేలుఁగవీథిని మంచినీళ్లపై
జాడలు యంత్రగర్భరసగంగరమాధురిఁ బాకశాకముల్
నాడలుఁతోల్చు మాటకువినాశనఘాతము పన్నులెన్నియో
వేసుకఁగూర్చు గడ్డిగలవీధుల పెంటలు బాగుజేయుటల్. 4

ఉ. ఇంటికి హెచ్చుపన్ను జలమీవికి తథ్యము దీపకాంతి పూ
కంటికి యంత్రధారణనికాయవిహార సమీరడోలికన్
మంటికిఁ బెంటపోగులకు మాడ్కులకాల్వలమీఱు బావికిన్
జంటలుపన్ను జట్టునకు శాశ్వతవృత్తము పౌరపాలనన్. 5

ఉ. తోపుడుబండి బాటకువితూలమనోజవతైలశాల సం
దీపచరాంగవాహినికిఁ దీవ్రవిహంగసమీరవాజికిం
గూపవిరామశూన్యజనఘోషము ముంపగు నెద్దుబండికిం
బాపము లేదు పుణ్యమును బావనసూష్యపు మాడుముట్టుటల్. 6

ఉ. మాలల నెత్తిగంపలకు మజ్జిగమాడ్పుల చట్టిముంతకున్
బాలలగడ్డిమోపులకు భామలచూతఫలాండరాశికిన్
శాలలదిర్గు చక్రిగుణశాలికిఁ గట్టెలమోతకూలికిన్
ఫాలవిశాలలోచన వివాదనినాదము కాఁగిటిండ్లలోన్ 7

చ. మురుగుకుఁ బ్రిక్కకాల్వల సమూహము దోమలపోటుకాటుకా
భరణము నీటిపన్నురణభారము మోతకుమూరుసొమ్ము ఘీం
కరణవివాదసౌఖ్యముల కంటకపాతముఁ గూర్తుమంచు ధీ
చరణముఁ జేసి కట్టుటకు శాసనమిత్తురు గ్రామదేవతల్. 8

చ. ఇరువదియైదుసభ్యుల సుఖేందువిలాసవిహారభోగముల్
గరపుటకేమి వాక్చతురకారకరాసులముంపు కూటముల్
తరుణులసెంకుమానికలతాళగతాముల రాగసారముల్
చరణగతానురంజకవిచారణవైరణ గాఢతాడనల్. 9

ఉ. మాటకు మాటకూడికకు మత్సరపూరణమేళతాళపుం
గూటమి జాళువాతళుకుకోరక చాతకవృష్టి పూర్ణమా
నాటకరంగవల్లి నవనాగరభాషణమాను కాదు స
య్యాటలు బావతోడ సరికంకర నేర్పరిమీఱు మాటలున్. 10

క. లక్షల కోకల రాసులు
శిక్షలకాకర విచారచేష్టలతీర్పున్
భక్షణ ఘాతసఖిజన
రక్షణ విపరీతలాభ రాగము మీఱున్. 11

—♦ ఓ టు పో టీ ♦—

ఉ. నేను సుబోధనుండ గణనీయవిదేశజయంత ధర్మవా
ద్యానురతుండఁ జాతురకులాంచితజాతుఁడ దేశసేవకై
శాసనరాజ్యమేలు నల కంకణదీక్షను బూనువాఁడ సో
పానము లెక్కి పోరుదు శుభస్ఫుటమౌ తమవోటు మాటునన్. 12

గీ. బంధుమిత్ర సఖీజనవర్ణపాత్ర
సంఘజనకరుణాశ్రయ సద్గుణవిత
రణవికాసనేత్ర నళినీరక్షణమున
నాగరాజుకు మీవోట్లు నగలు తెరవు. 13

గీ. పురసుపాలకసంఘము పూర్ణలక్ష
జనసమూహా దిక్పతిరాష్ట్రసంగరంబు
శాసనసభాసమావేశ సంస్థలకును
నెన్నికలుగల పోటీలు చెన్నుమీఱె. 14

సీ. న్యాయవాదిరసికమాయవాది ధనస
హోదరఘృత వీతిహోత్రుఁడనఁగఁ
బరదేశవాణిజ్య వాహనరాజి హే
మరతిపాశజలధి మందరమన
భూభోగమారుత పూర్ణాంబువాక్ఛన్య
నయనాంగుఁడు విఘాత నావయనఁగ

ధనరధవ్యాపార దక్షుణశూన్య మం
బరవిహార విమానపథమనంగ

గీ. నాగరాజు నారాయణ నగరశాస
నసభకు వెడలి ప్రార్థనలెస నలుపఁగ
రామిరెడ్డి కృష్ణవరుఁలు రాగమలర
స్థానికాధికసంస్థల సంగమలర. 15

మ. నను న్యాయాస్థపితౌనశాస్త్రరతిబాుణస్థైర్యవాక్చాతురీ
ఘనవిద్యాధరభూషణాంబర రమాకాంతున్ స్వరాజ్యప్రదో
షనవీనాంబర భాస్కరాంశుకర సంసారాంతకుంద్యాగపా
లనదీక్షా గురుగౌరవంబెనయనోల్లంగూర్చి వెంటాడఁగా. 16

గీ. ఎత్తుకెత్తు కాంచనవృష్టి మత్తుగరపు
గ్రామపాలకపంథలారామకూప
సరసుల ధనసృష్టిఁ బెరుగు శాంతికొలువు
సంఘటిల్లుకృష్ణకృపను శక్తిఁగనుఁడు. 17

గీ. అని ప్రభోధనగావించు యక్షువృత్తి
శూన్యకృష్ణమూర్తిపలుకు క్షుద్రజనహృ
దంతరాళము వెలుఁగొందు నార్తికర్ణ
శల్యరణరాగవృష్టి విషాదమొదవ. 18

శా. నేనే శాసనదిక్పదంబు సహజానీకైక బృందంబుతో
వానప్రస్థుని జేయు నర్షుఁడను సంవాదంబు శోభిల్లఁగా
నానానేక సభాంగసౌధముల వన్యాజన్యభాగ్యంబులన్
సానంబట్టెడు నేర్పుఁ బేర్చితిని విశ్వాసంబు వాటిల్లఁగన్. 19

ఉ. మీకరుణారసంబు ధనమేరువుకూటమి నాశ్రయించి మై
నాకులవార్తలోహజలనాగరభూషణ భోగిరాజుతో

మైకముగ్రమ్మఁ బోరుటకు మంథరనై తిని సూపభోజ్యమా
పాకముగూర్తు శాశ్వతశుభంబులఁ గూర్చెను వోట్లదార్పుకున్. 20

గీ. తనర నారాయణుండవితరణమధన
తరుణవాణిజ్యపోషక ధర్మరక్ష
చరణకేదారభూదార సమ్మతుండఁ
గరణశేవక నరుఁడనుగాను విడువ. 21

ఉ. సీరివికారశూన్యవనశీతలభూములవేడివేల్పు హం
కారము లెండగట్టు గుణకారుఁడు మీరును మాయమర్మముం
గారణదేహఘాతుకవికారవినాశనవృత్తి శూన్యమా
ధీరుఁడు రామిరెడ్డి రణతీక్ష్ణవితండ వివాదమేమనన్. 22

ఉ. రూకలమారుబేరము విరోధము శాశ్వత భూమిదానముల్
భీకరవృత్తవర్తనము వేడుకమాటలు మాయమాటలున్
మూకలుతీరు మత్స్యములు ముంగిటకూర్పులు రాత్రి సైగలా
భూకులయక్షగానములు పూజలురూటరు వేదభాషణల్. 23

మ. కరుణాసింధువు త్యాగమూర్తి ధనవాక్యప్రేష్ట సంగీతవై
ఖరులందెల్పెడు యంత్రరాగమున విఖ్యాతంబు శోభిల్లఁగా
నరసంగంబుల వెంటఁగూర్చుకొని వెంటంగొల్చు మోటార్లతోఁ
జరణంబిడ్చెడు చల్లపల్లిపస మీర్జాపూరు పోటీలనన్. 24

మ. పరదాస్య ప్రకటీకృతాంబుధర సాంపత్యస్వదేశాంబరో
ద్ధరగాఢాంధవికారభాస్వదఘుమార్తాండ ప్రకాశోజ్జ్వలా
కరమాతంగ విమానరాష్ట్రపదవిఖ్యాతాంగసన్నాహ్యసచా
మరశాంతేక్షణగాంధిదేవ వచనోన్మానంబు శోభిల్లఁగన్. 25

శా. పాంచాలీజన వీరమానధన పాపంబే విశాలాక్షియై
వాంఛోద్రేకవినాశ శాశ్వత వియాపస్వాంత వైషమ్యభ

ద్రాంచచ్ఛత్రసమూహమై నిలువ నిద్రాభోగమేరీతి సా
ధించుంజాతురిజూపిమేల్కొనుఁడుస్వాయూప్యాంగదర్పంబుతోన్. 26

ఉ. శాసనపారశాల ధనశశ్వదుదూజ్జ్వల క్షేత్రరాశిపై
వాసన మూలవ్రేళ్ళనలిబాడ్వలతోడను బాయకాటుచే
శాసన వీరధిక్కరణసంగరశాంతి రణానుసంగమే
వాసరమంత్యకాలమున వాడని స్వేచ్ఛకునీడయై తగన్. 27

ఉ. రాటముభారతాంబదినరాజ విభాకరపూర్ణబింబమూ
పాటలగంధి భీంకరణవాదముఁ బేర్చుచు సీమవర్తకో
ద్ఘాటపురోగ్రభాగముల దండధరాంశ వితండ తేజమై
కూటికి గుడ్డకుంగొఱతకూడని స్వేచ్ఛకుధూపదీపమై. 28

శా. న్యాయస్థాన బహిష్కరాధునిక విఖ్యాతంబు పంచాయతీ
వ్యాయామంబు విదేశవస్తు జితవేశ్యా మోహరాహిత్యమా
కాయావేశవిరోధవర్ణ గుణహంకారంబు చన్నీటితో
మాయంజేసి విహారమున్నలుప సూక్ష్మంబౌను స్వాతంత్ర్యముల్. 29

ఉ. పానమురూపుమాపి ఘనభారతసత్వర రాజ్యయంత్రమా
గానము రాట్నమంచిముడఁ గానక భ్రాంతుల మారువేషమా
ధ్యానము వర్ణపంక్తులనుదాల్చినమాటలు రాహుసాహెబుల్
కానుకమేయు సేవకులకాపురమైతిరి ప్రోగువేయకన్. 30

క. బ్రహ్మవరబలముకలిమిని
బ్రహ్మానందమ్ముకలుగు బాధలుమాయన్
బ్రాహ్మణసహకారంబును
బ్రహ్మసుచర్యసుఖ మూఁబంధముతోడన్. 31

ఉ. భారతరాజ్యలక్ష్మికిఁక స్వాగతరాజ్యము సుందరాంగనల్
చారువిహారరమ్యసమచాతురభాగము శాంతివైరమున్

భూరివరాన్వయార్ధ తతపూర్ణవితంతుల తోడునీడయై
ఘోరతరాంధకార ఘనకూటముఁబాపుడు స్వేచ్ఛమిత్రుతోన్. 32

ఉ. శాంతిసమాగమాజిననశాఖలు పందిరిమూలకందమై
భ్రాంతులుమార్చి మోటసిరిపచ్చలపద్మిని పత్రిచక్రియై
కాంతులఁగ్రాలిమధ్యము విఘాతముమాలలకూడునీడయై
బంతులుదీర్చి గ్రామములు పాత్రములయ్యెను మూలశక్తిచేన్. 33

శా. పారావారముదాఁటి మ్రోతలిడుశోభానాథవాక్ప్రాణమై
ఘోరాకారవిహారతంతిజలసంకూటంబువాటిల్లఁ గం
గారాగారవిశాలయంత్రమున లగ్గల్వట్టి దట్టింపఁగా
ధారాపాతవినోదముల్గరపు వార్తాపత్రికారాధనల్. 34

గీ. ముసలమాను హిందూసఖ్యముగరుపుపని
యాలిసోదరలాలు పిత్రాదిసుతుల
దేశబంధు భక్తవిజయధీరరాజ
పాండ్యకేల్కారుననుసారప్రమథగణము. 35

గీ. దేశభాషల గౌరవదీక్షఁ గరుప
శాంతిభటుల సత్సహాకారసత్త్వబుద్ధి
రాష్ట్రములు పట్టణంబులు రాత్రి పల్లె
టూళ్ళు సుప్రబోధముజేయు నొప్పుమెఱయ. 36

ఉ. ముప్పదిమూఁడుకోట్లు జనమూలము భారతదేశమందొకే
త్రిప్పుడుమాటతోడు రణతీక్ష్ణసువాదము గూడువాక్సభన్
మెప్పులుగోరు నాంగ్లజననిర్మలశక్తుల యుక్తిమాటలే
చొప్పున కర్షకుల్వణిజ శోధకులుండగు పల్లెలూఁడ్వకన్. 37

మ. రమణీయాదృశసత్వసంపదకు స్వార్థత్యాగ పూర్ణాంశమే
కమనీయాకృతి దేహపీడన సుధాకారుణ్య శస్త్రాంగియై

సమచాతుర్యసుగంధతేజము వికాసత్వంబు నొందించదా !
ప్రమదావన్యవితండసద్విజసుఖాభ్యాసార్తమాలిన్యలన్. 38

మ. వరశార్దూలమృగేంద్రహస్తి గణవిశ్వాసార్హశ్రోత్రియులన్
భరతాధార కృపాణదేశహితగోపాలుండు రత్నాకరాం
గరమావల్లభ నెహ్రుభక్తులను విఖ్యాతంబు ఘూర్ణిల్లఁగా
ధరబంధించిన యోట్లత్యాగమున విద్యాస్ఫూర్తి శోధించరా. 39

గీ. అంచు గాఢప్రబోధము హర్మ్యగతము
శాంతిభటుల యుపన్యాసకాంతిజిలక
నాగరాజు నారాయణ త్యాగబుద్ధి
న్యాయమందిరవాసము మేయఁదొడరె. 40

—♦ న్యాయస్థానములు ♦—

సీ. సెలయేటి తెమ్మెరచినుకులు సౌధాగ్ర
శిరముల తేంట్లకుఁ జిక్కుఁదీయ
హర్మ్యపర్వతకూటహాస విలాసము
మిన్నేటిదంతుల మేలుకొలుప
గ్రామపాలక కనకనిలయవితరణ
శాశ్వతభోగము శాంతిఁగరుప
రాజకీలక భాష రాజితాచలవృత్తి
తాళగతులుగూడ తలలుమెఱయ

గీ. వివిధరాష్ట్రపతితుల వేల్పు పెద్ద
జగడములఁదీర్చు కారుణ్యచక్రగరిమ
ధనవిఘాతసూత్రంబున తలలుమార్చు
న్యాయమందిరదండము చాయమెఱసె. 41

ఉ. మాటకు వేయిరూకలనుమానను హస్తగతంబుగానిచో
మేటులు పుస్తకంబులు నిమేయవివాదము వ్యాజ్యనాశనం

బేటికి సంఘటిల్లెనను నేటుకు దీపపు మేడమెట్టుపై
ఘాటికి నిచ్చెనన్నిలుపు దక్షుఁడ చూతువు నాదు ప్రజ్ఞయున్. 42

ఉ. పాదము రంగవల్లి ఘనభాగ్యము చేసితి న్యాయశాస్త్ర సం
వాదము తీర్పుమీఱు తమభాగ్యము దేవరవల్పుపాట ప్రా
సాదములందఁగొంచరి విషాదముఁ జూచితి ధర్మరాజు నా
శోధనఁ జూచి యిట్టులమొసొత్తును గూర్పుము భీతిఁ జెందకన్. 43

గీ. గెలుపు సత్యముపై తీర్పు కలకమార్పు
నీవు నాకిచ్చు విత్తపుటీవిజూడు
మనెడి న్యాయవాదిపలుకు వినయవృత్తి
నాలకించువాది మనము శూలమయ్యె. 44

ఉ. నెత్తురుకూడు పాయసవినిర్మలవేతన భోజ్యపాత్రమా
సత్తువగూడు వృత్తమున శాంతవిహారము సల్పు సత్త్వసం
పత్తికిఁగొమ్మ ధర్మరథమందిరదండ ధరాంశమున్నదా
హత్తుచు శిక్షలంగరపు న్యాయసులక్షణసార మోపుచున్. 45

చ. ఘనులకు న్యాయదేవత సుఖంబులఁగూర్పులుఁ దీర్పులన్నియున్
వనచరఘాతమూర్ఖులకు భార్గవరాముఁడు మారుమాటలే
మన వినఘూళిపారు వరమంజులవారణ హస్తగుప్తిచే
ధనమదమానవాధములఁ దాకును భూధరచిత్రగుప్తుఁడై. 46

ఉ. వేషము మారుతీరుజనవీక్షణతాళము మోఁతవెట్టు సం
భాషణచారులీల ఘనవర్ణములోపల దూరనీనిమేల్
రోషము గూడుగట్టు వరలోహపుచిహ్నము ముందు దాల్చు పై
భూషణరాజముల్గరుపు పూజ్యుఁడు పిల్పులరాయఁడీడ్వడున్. 47

మ. వర ధర్మాంగ్లవిధానశాస్త్రఘనసంవాదంబు నువ్వెత్తగా
నరరాజాసనశాసనాకర శిరోన్యాసంబు తీర్పారగా

ధర నేత్రోత్సవమూర్చు వాదాముల సంతాపంబు జీర్ణించఁగాఁ
జరకాండోళిపహోకపాత్రములు నింపాల్వొంటు వాక్స్రోదరుల్. 48

ఉ. నూటికిఁ దొంబదైదు కలినుగ్గులుతీరులు పత్రిగీతమై
మాటికి గోలలెట్ట ఘనమత్సరదాతలగుండెగొట్టుపై
గాటలు పొత్తుతప్పునది కాదిఁక రూకకు బేడలేటన్!
చాటునగూడి కంటతడి సభ్యులఁజూడని మానివేసనల్. 49

ఉ. శాసనసభ్యవర్య ఘనశాశ్వతసౌఖ్యము నాగరాజకే
శాసనబీజమై మసలశాంతివిచక్షణ రూపుమాపి వి
శ్వాసము న్యాయసౌధముల పంచను బ్రాకుచు వ్యాజ్యవాద భు
గ్వాసన ముద్రితంబులయి భాసిలవాదము న్యాయవాదమా. 50

శా. నారాయాఖ్యుఁడు చెన్నపట్టణరమాన్యాయైక విద్వాంస శ
స్త్రాయాథోత్తమశక్తిసంయుతుఁడు సత్త్వాన్వేషణారంభవా
గ్ధీరోదారుఁడు జిష్ణుపద్మగళసందీప ప్రకాశోజ్జ్వలా
కారాంతర్మణికృష్ణసామయరుసఖ్యంబప్పు తోడ్తేరఁడాన్. 51

ఉ. పూటకువేయిరూకలును పోకలకర్చులు వెంటనంటుపై
పాటుల మూగతిప్పచలపాదికి రొక్కము నూఱురూకలున్
మాటలు న్యాయచట్టములముంగిటఁబెట్టుచులాలిపాటకో
లాటముపుట్టకెక్కు నవలాపలుమాటలు బూకరించుచున్. 52

ఉ. వాదినిగూడగుప్తుఁడు వివాదనకర్తుఁడు తీర్పులక్షి నా
వాదమునందఁబట్టు ప్రతివాది నిజంబుగదొంగలెక్కపై
సాదముతీరుమీఱు పగచాటునదూరెను సాక్ష్యవర్గమే
భేదములేనినోట వినపీడును సంశయమంచుహత్తుచున్. 53

చ. ప్రభువర! చొప్పడఁటుపసపల్కులు వాదము(శ్రీ)నివాసచా
ర్యభుజగ భూషణార్భటి నియంతవిషాదముఁదీర్చు పాశ

శుభగుణ శాస్త్రవేత్త జనశోభనఛత్రికి శ్రోత్రగాత్రమా
ఘ్రిభువర చెన్నపట్టణపు వాదముఁజూపుదు తీరుమారుగన్. 54

మ. ప్రతివాదంబులు జీర్ణవస్త్రములు నిర్వ్యాపారపత్రాంగనల్
చతురానంద వికాశపాత్రములు వాత్సల్యంబు జోకొట్టగా
గత కాంతారవిహారకర్ణముల లెక్కల్పట్టి దిద్దించఁగా
శతపత్రేక్షణ సాక్ష్యమేమనఁగ వాత్సల్యంబు నింకారఁగా. 55

ఉ. ఎంకుకు వేళమించెఁ జలిపిడినపాయసపాన నాదముల్
జందనగర్భమావ ఘనసంకటభేదముదీర్చు నిర్జైనల్
సంకులపొందు దోసెలు విషాదముతీర్పులు నారికేళముల్
మందులతేఁడు తంబళము మాటికి మక్కువమీఱు వాదముల్. 56

శా. కందారాజులదండు కబ్బురపు క్రేంకారంపు వాక్చాతురీ
సందారావములందుఁ బిక్కటిలఁ గర్ణాకీర్ణహుంకార పా
తాళిందోళోత్సవహస్తలాఘవ విహారస్ఫూర్తివిందారగా
సందేహంబిఁకలేదు గెల్వనఁగ వాక్సాందేంద్రవాదార్భటుల్. 57

చ. తదుపరి శ్రీనివాసపరతంత్రముఁజూడుఁడు గద్దెనెక్కి ధ
ర్మధననిధీశ! మాటలకు మంథరసారము గూడఁగట్టుపై
కధనములన్ని విప్లవవికారము లేయగుఁ గొత్తతీర్పుఁ జూ
పుదు నిఁక మాటలేలికలు బూటకపౌజులు మారుమోతలే. 58

ఉ. లంచము హత్యకాముకవిలాస రహస్యసుసౌఖ్యభోగమే
వంచన క్రూరకర్మతుఁడు పాపునఁజేయును సాక్ష్యరూపమా
లాంఛనమెట్లు సంఘటిలు లాలనపల్కులు జిల్కనమ్మరా
కంచెలముండ్లనూడ్చి నరకంధర! పూవులుగోయ న్యాయమా. 59

ఉ. సారములేనివాది కలిసాదముమాటలు మూటలేయనన్
గౌరవపాత్రుఁడైన సురకంఠునినోటికి వచ్చినట్లుగాఁ

గౌరపుపాలు జల్లుటను గక్షుకు దేవరపక్షమునందునే
గౌరవమాననష్టమున ఖండనవ్యాజ్యముతప్పదింతటన్. 60

ఉ. ఇంద్రుని భోగభాగ్యములకీడ్వడు సత్పథశాసనాంకభూ
చంద్రుఁడు మేఁమీఱు వనసామదభాషనుప్రశ్నకేతగన్
రంధ్రములుగ్గఁబట్టి నయరక్షణచే మనపూర్ణసభ్య ని
స్తంధ్రవరోక్తి శాసనవిధాతకు మార్తను రూపుమాపఁగాన్. 61

శా. వాదాభేదము లేటికింకెటికి వాగ్బంధంబు వారింపవా!
కాదో లేదిఁక క్రొత్త తీర్పుఁగన శంకల్దీర్పు సోపానన్యా
యాధ్యార్థికబంధు చెన్నపురి పూర్ణాంధ్రప్రభూర్వీస్థలిన్
మాదేవుండు జయంబుఁబొందెనను సంబంధంబు సంధించఁగాఁ. 62

ఉ. ఔనను న్యాయదేవత వచోర్భటి సంతతమొందఁజేయ న్యా
యానన! ధర్మసూత్మనయనాంకురమంటిది బుద్ధిమాంద్యమున్
సానులపాలుజేసితివి సంగరవాదులు శాసనాధ్యమా
మ్రానును వంపనెంచితిరి మాప్రతివాదికి న్యాయమేసుమీ ! 63

ఉ. వాదములన్నివింటి ఘనపాత్రిలు సాక్షులున్యాయదిక్పతుల్
వాదము లెక్కపెట్టు కడు వాణెములూడ్చిరి మార్పుతీర్పు లే
భేదము లేనికూర్పులు నవీనసుధాకరవర్ణపాత్రిముల్
ఖేదముగూర్చు వాదములు ఖేదనశాసనరూప నాశముల్. 64

ఉ. శాసనరాజకీయ తరుశాఖల సభ్యులు తద్వదాళినిన్
భాసురలీల మార్చుటకు వాదముభారము మేరమీరుపై
వాసముగూలఁబడ్డ రణపాతముఁబేర్చునుబీజనాశ వి
న్యాసమదేల యుద్ధటికి న్యాయము వాదము పుట్టినట్టుగాన్. 65

గీ. అనుచు న్యాయదేవత తీర్పువినఁగ గోడ
మీఁది పిల్లివాటము మేరమీఱ నుభయ

కక్షులును బూర్ణసభకు వికాసమెరయ
న్యాయవాద వివాద సనాతనులయి. 66

గీ. రామిరెడ్డికిఁ బోటీలులేమివిధిని
ప్రథమజిల్లాతులాధ్యక్షపదవి కలిమి
హస్తగతమై వికాసతయావహింప,
నూతనోద్యోగభరమునఁ బాతుకొనియె. 67

ఉ. నాతనువాత చారుతరనాగులు వల్లురు నిల్వసొమ్ముపై
చేతులు పిలిహోత్రిల వశీకరణంబగు త్రోవఁద్రొక్కుచుం
జాతురిమీఱి బాటలను శాలలు ధాటిగఁబాళ్లు పంపులుం
బాతికపాలతీరు భువివాసముఁజేసిన నాయకాగ్రిణిన్. 68

గీ. కమ్మసంఘపుమొలకల కాలిబలము
తీసివేతవిరాగముఁ దెల్పువిధుల
తావకాన్వయగుణకార మావహిల్లఁ
జేతనులఁజేదఁ జేతులు మూఁతలయ్యె. 69

క. రూకకణాయరమాత్రము
భీకరవృత్తిని నలుగుడుబెట్టుచు లాగన్
మూకలకర్చులు వోవం
దూకము లిత్తురు సరియగు త్రోవలు ద్రొక్కన్. 70

సీ. పూర్వార్జితపుసొత్తు పుష్కరంబై పేర్చు
దానివెచ్చించు సదనమనంగ
త్యాగభోగముపీడి దర్పవిహారగా
రవమునఁగల్పించు రాష్ట్రమనఁగ
రాకపోకలజాడ రైలుకర్చులపైన
భాగములనుగూర్చు బంధువనఁగ

సూపకారవిరాళశూన్యులై మసలక
పలుమాటలకుఁ దలవాకిలనఁగ

గీ. వివిధసీమలఁ గోనలవింతదారులు
మధ్యరాష్ట్రంబున మరుగు మార్గమరసి
క్షణము కాలమున సలుపు చర్యలెట్లు
ప్రజల క్షేమముగరపునో భవుని కెరుక. 71

క. అధ్యక్షసుమణి సుమనో
విద్యావిహీన పశుబలపేడితసహజ
న్మాధ్యాపకుఁడగుట సభా
మిధ్యాపవాదముఁగూర్చు మిసుకులు వెలుఁగన్. 72

ఉ. మాకిసుమంత నమ్మకము మండలసభ్యనియంత్రితాధ్యపై
పైకిఁ గనంగ రాదని వివర్గవిశారదబృందసంతతుల్
వ్యాకులచిత్తులై వరలుయాత్రలు పత్రవిలేఖగీతమై
భీకరశక్తిసంయుత విభీషణధర్మికి విన్నవించఁగాన్. 73

శా. నాకీభాగ్యపు వేదనంబసలు శూన్యంబౌ విరామంబు లే
నాకొల్వున్నచితాసనంబొకఁడు విన్యాసంపుఁ జేవ్రాలుచే
వేకాకుండమదీయకార్యముల మాయించే విఘాతంబు గూ
ర్చేకార్పణ్యము దీని నేవిధిని కాల్తేనంచు నూహించఁగాన్. 74

ఉ. మండలధర్మపాలన సుమంగళదిక్పతి రామిరెడ్డియే
చండతరంగశాంతరణ సంగరధూర్తుఁడు వాదభేద్యులన్
గండెసఁగించకున్న మదగర్వవిలాసము రాజ్యహానియా
తండఁ మేలు న్యాయధనదాతకుఁ బొమ్మని త్రోసివేయఁగాఁ. 75

చ. స్థిరతర కార్యవర్గముల క్షేమము కూర్పులవైరమార్చుచున్
ధరనుత ధర్మపాలన విధానమునన్పుచు ఖ్యాతిఁ బేర్చుచున్

సురవర సౌఖ్యగేహముల నాకనుభూజము కీర్తికాంతతోఁ
జరణము జేసి గ్రామములసంధులుదీర్చిన తృప్తమానమున్. 76

ఉ. వేషమునున్న డాంబికము భీకరవృత్తములేశమాత్రముల్
భాషణమన్నవీసము వివాదములేనికి సూత్రధారుఁడే
రోషములేదు మర్మమనురోక్కము సూక్ష్మము న్యాయదీక్షయే
భూషణమౌ వికాసమునఁ బూజ్యుని జేసెను రామిరెడ్డిపన్. 77

## విమానవర్ణనము

మ. వలయాకారము నేర్పు తీర్పుతమితోఁ బక్షంబులై సత్త్వం
గలయంగూర్చి విహారయంత్రబలసంఘంబౌని తూణీరమై
తలయెత్తెన్వివిధాండగోళముల వాత్సల్యంబుతోఁ దేర రాఁ
జలజాగారము నన్ విమానముసుఖోన్మాదంబుఁ బక్షించుప్రేఁడై. 78

శా. మాహామంచులగట్టునుండి వనరమ్యంబైన రామేశ్వరం
బేమీ, యల్లునివాసరంగమున సంవీక్షించి వార్తార్థముల్
పైమార్గంబున మోసితెట్టుమరదివ్యంబౌ విమానంబు ని
త్యామోదంబును గూర్చుకుండు జనసౌఖ్యాంగార్థ సోపానమై. 79

గీ. తదనిల విమానరాజ్యంబుఁ దరిమినడుపు
శ్వేతవిధిని చేతంబట్టి శీఘ్రగమన
లసదుపాయంబున ధనము లాగులాక
శీతగిరి సేతుబంధర శేషుఁడయ్యె. 80

ఉ. ప్రాణములుగ్గఁబట్టి ఋణబంధముఁదెంచి వికారరూపమున్
వేణిచలింపఁ గన్బొచుల నేర్పునఁ జక్కఁగఁ మూఁతపెట్టుచుం
జాణిపదంబులం గదసిపట్టుచుఁ గంపమునొందుచుండ గీ
ర్వాణము పల్కలేలకను వంతలుదీరునె గాలిగూటిలోన్. 81

ఉ. కంటకిఁ బూఁతవెట్టి సురఘంటికఁ గొట్టుచు గాలిగొట్టముం
బంటికి ముంగిటుంచి వనపల్కులు జిల్కుచుఁ బట్టుకొమ్మపై
మింటికిఁ జూరగొట్టు కలిమిన్నులుదాఁకుచు భీతిఁ జెంజకన్
గొంటకు సౌఖ్యపద్ధతులు గూర్తురు నిల్కడలేని భూమిలోన్. 82

శా. తారామండలమెక్కి వారిధరగోత్రిద్వేష శీతాంశుమై
పారావారము మేఘమండలము నూర్ధ్వంబై ప్రతీంద్రాంబుభిం
బారామంబుల పద్మినీలతల తుర్యాతీతమందాక్షమా
మేరుంగండ్లను మర్భిణీస్వరచిపై మింటిన్వినోదించుచున్. 83

ఉ. వాయుపదంబుపైన నుడుపద్మవిరోధిపథంబు గోత్రభి
న్నాయుసభాపథంబు విధిమంజులమండలముం ద్రిలోచనాం
గాయుధభోగిమండలము వ్యాసవిభాకరనేత్రరాజ ప
ద్మోదయగర్భగోళము మహోదయ దివ్యసహాయతం దగున్. 84

శా. పోవంబోవఁగ గాలిసన్నమయి కన్పెమ్మల్ విరూపాక్షులై
తోవంబోవఁగ గాలిఁ బేర్చు ఖగసందోహంబులో మిద్దెయా
భావం బెంతయుఁ గూర్ప గాలిపటమేప్రాంతంబు జోకొట్టునో
యూవంతైన విషాదమొందఁదగునా యంచున్నదైత్యామరుల్. 85

శా. జీవన్ముక్తులు శాంతిఁ బొందువరి సంజీవౌషధీవైరితే
జోవాసంబున బీజవృద్ధవిరథుల్ సూక్ష్మించి రాజాది స
ద్భావఃబందుచు జన్మకారక సుసౌభాగ్యంపు లోకంబులం
బోనందారఃనన్ మనుర్ వివిధ సత్పూజార్హదీపంబులై. 86

సీ. సత్యసంధులు నిరతాన్న సద్విజపరి
పోషకులు దానకర్ణులు పూర్ణధర్మ
రతులు పతిభక్తి విభవశారదలు ధ్రువప
థంబునుడు రాజ దవ్వైలై తమినిబొదుగ. 8

ఉ. ఏవిధి మానవాత్మజుఁడు నీదివి జెట్టనుబట్టకుండఁగన్
బోవును వీని సామ్యము వినోదమురావణకృత్యమట్టి మా
యావినరాంధకార మదహాంతకుఁ డేగతి గాలినీదు నా
చేవనుజూడ వాయుసుతచాతురిమీఱును శంక లేదిఁకన్. 88

గీ. పరగ మర్త్య పాతాళ భూవర్గలోక
వాసులకు ముప్పురాదు రవ్వంత రాక్ష
సాధముల దృక్పథంబు సంగాయుధ సుర
కాంతలన్ హరింప వినోదగరిమ మెఱయఁ
జూడఁ జుల్కన స్వర్గము జూడఁజూడ. 89

చ. అనుచును స్వర్గభర్త విషయార్తిని మున్కలు దేలుచుండఁగన్
వినయముతోడ నారద వివేక విధాత సుతాదరంబుతో
ఘనవర తాపమెందులకుఁ గాంచనగర్భుఁడు కంటికెప్పయై
మనలను గాచుచుండ భయమానసమాంద్యముఁబొంద నేటికిన్. 90

సీ. తన భరతకళాసుధానిధి రంజించు
రమణీయ స్వరశిరాగమరయఁ
దన నాట్యశాస్త్రవిదాపము శోభించు
రంభసంరంభ సరసము మెఱయఁ
దన లోకసౌభాగ్యతరుణులఁ బుష్పించు
జాణాతిలోత్తమ సఖ్యమరయఁ
దన పదభ్రష్టవిధానతత్పర యోగ
వీరుల్మరుల్పాలు వెట్టుమేన

గీ. కవివిధసుగీతసాహిత్య గణ్యులంత
వందిమాగధపాఠక వర్గచయము
నారదాదిమునీశ్వర పౌరజనులు
కొలువుకూటంబు నింకాంచు చెలువుమీఱ. 91

గీ. అనిమిషసురాధిప భయవిపాకరగుణ
పీడిత మనోవికారుఁడై వేల్పుతోఁ వ
కలఁతఁజెందఁ గీపెట్టెను కండ్లువేయు
మూఁతవడఁగఁ జూపరూల్పుక్షీతిజెంద. 92

ఉ. నావెనువెంట రంభసుగుణంబులపోఁవుచుబంపు మేనుదన్
దోఁవను నేడికంటికి స్వరూపముమూర్చుచుఁ గానకుండ నా
పావనభీను తేజుని వివాదములేకయ సంధిఁగూర్చు సం
భావము సంఘటింతు రణభారము హేయము భోగశాలికిన్. 93

చ. హరిహరియందు నారదవరార్హసుధాకర పూర్ణబింబ భా
సురకళతోఁడఁబుట్టు మధుసూదన నాట్యవిహారశంకరో
ద్ధర రసమాధురీకలితధారణ లక్ష్మినిమాయఁగట్టు రం
భరమణితోఁడ నాటలును బాటలు బాడుచు వచ్చుచుండఁగన్. 94

ఉ. మానవమృణ్మయాంగముల మందపుఁజూపుల తేటతెల్లనౌ
సానలఁదీరి నాకమునఁ జాతురిదీటినమర్మవేద్య లే
పానమునైనఁ గైకొనరు బాలురుమాటికిఁగన్నమూఁతలే
గానము కంటఁజూచినను గామ్యము వీరికిఁ జెమ్మరిల్లునా? 95

ఉ. చూపుల మాలసౌరభకిసోరరసంబులఁ దేంట్లుగోఁలి కం
దూపులదోర్ల మోవిరసదుగ్ధము లూటలు నివ్వటిల్ల ము
క్తాఫలరూపమున్వలచి కమ్రదిశాగజమధ్య వక్షపుం
బ్రోపునరంభ యూరుపదబంధురమైశశిదోఁసి రాజునన్. 96

సీ. తొలకరిమెఱుపుసందోహముఁ జూపట్టు
మెఱుపుగాదది చెలిమిన్న నేణి
చంద్రబింబమునడిరంధ్రముంజూపట్టు
రంధ్రంబుగాదది రసికహారిణి

గోత్రభిద్రామవము గుండెలంజోకట్టు
వరపయోధరపద తరణి మెఱయు
నరకచక్రము నేర్పు హాస్యము హొంబట్టు
జఘనద్వయంబుల జగడమరయఁ
తే. దరల కర్పూరగంధము తఱిమికొట్టుఁ
బ్రిబల నూరుద్వయంబుల పాదపద్మ
విలసనంబులఁ దనరారు వేఁప్రకన్నె
పాదమస్తకపరిమళ భ్రాంతిగరపు. 97

క. ఉన్నత కుచభర ఝుగనపుఁ
దిన్నెలసందున నలుగుడుదిబ్బలు భీతిన్
సన్నగిలిన నడుమువణఁక
మన్ననబంబడయకుండు మనుజులమాటున్. 98

ఉ. నారదమానివర్యుని నినాదము నాట్యవిశాగదాంబరం
భారమస్వచ్ఛపాండుతను పద్మము పూవులబొమ్మగల్గు భూ
భారముఁ బేర్చు మర్త్యవర భామల రూపము దీని ముంగిటన్
సారములేని తమ్మికలిసంకుసగిట్టిన మట్టిబొమ్మలే. 99

ఉ. అంచువినోదమొందఁ దజిహాస్యపుపల్కులు దిమ్మరించుచుం
బంచనుజేరి నారదుఁడు మంగళమానని దేశమెద్దియో
చంచువాయుమార్గమున సంగతమెద్ది విమానమార్గమే
పంచశరంబులందరుము పావనరూపముఁ దాల్చనెంచితో. 100

ఉ. ఓ సురమాని మిమ్ముగని యుత్తమలోక నివాసవాసమా
భాసురమైన నా నయనభాస్కరభూషణమైతి భాగ్యమే
వ్యాసముఁగూర్చకుండును మదన్వయభాగ్యపురేఖ లేమనన్
వాస[illegible]గ్యలోకము సపత్నిని గూడిన సీరపాణినిన్. 101

ఉ. భారతదేశరాజ్యరణభారము మార్చునఁ దెల్లదేవి భూ
సారము వృద్ధిఁ బొందుటకు సంగరరంగవితండవాద వా
గ్ధీరుల గుండ్రఁబల్లచలితెల్పుల పాండురమావిభాకరాం
గారకరాజు సన్నిధికి కంటికినాసని వాయువేగమున్. 102

చ. స్థిరతర కామ్యకర్మరత సిద్ధులు బొందెడు స్వర్గలోక సౌ
ఖ్యరసికభోగభాగ్యములు కాంతులకౌఁగిటమూఁపుతీర్లు మే
నారయఁగఁ జేసితయ్యయస నూరులపొంకముఁ జూపకుండు నా
మరణము లేని శాశ్వతపు మాధవలోకము పాలుజేయకన్. 103

చ. అనుచును నారదాది త్రిదివాధిపుకాంతయు వాయుచక్రిముం
దనరఁగ నెక్కె మానవునిదండనుమీటుచు ముందు వానియు
వెనుకను దేవవేశ్య ఘనవీణలసందుల మట్టగింపులం
దనువున శ్వేదబిందురసధారల నీతలుఁ బ్రోఁత లెట్టగన్. 104

చ. విలసితయామస్వచ్ఛతను పింగళరూపము భావికార్యముల్
తలఁపునలేక స్వర్గసుఖదంతిని జూచుట నోఁజనెన్ బళీ!
సలలితవారిధారలను జల్లుచుయంత్రము త్రిప్పలాడు చే
ఫలితమెయంచు దృష్టినిడి బానిసకూటమి రెప్పలార్పకన్. 105

చ. నడుపుమనుండె బండి మరనాయకుఁ డంతట వేగిరంబుతో
సడలక దుర్భిణింగనుచు శశ్వదురూన్నత యంత్రదీపమున్
వడివడి రెండుచేతులను బట్టుచు మేనులు గంపమొందఁగా
సుడిపడిపోవు నవ్వులను చోద్యపుఁజూపులలోన జూడకన్ 106

చ. నలుగురు రూపయువ్వనులు నాకముద్వారము చెంతఁ జేరఁగం
జలిత నిజాంగవాయువన చంచలదేవుఁడు
కలియఁగ నగ్నిదగ్ధరసగంధము మాటున మేరమీఱు
ఫిలయము నొందకుండ సురవీక్షణ జేయుచు సొంపుమీఱఁగన్. 107

క. వాయుపథము మెల్లనడిగి
కాయము వణకునజడియుచుఁ గన్నీరొలుకన్
సాయము జేతుల సురమునిఁ
గాయుచుఁబోవన్నరుల సుగంధముగొట్టన్. 108

ఉ. నారదమౌని రంభనరనాథులు నాకముఁ జొచ్చుచుంటిరే
కారణమేమి ? సూక్ష్మతను గంధముతోడుత రాకసోకిలే
వీరులకల్ల స్వర్గసుఖవేదము వీరలు లోనికేగినం
జారు రమావిలోచనవిశారదు కోపముదాళ శక్యమే ! 109

ఉ. అంచునుస్వర్గసేవక నియామకవర్గము భీతిఁజెందఁగాఁ
గాంచనగర్భసన్నిధికిఁ గానుక మానవలోకవాసినిన్
మించిన వైభవోన్నతిని మేళము తాళముతోడ నింద్రుఁడున్
వంచనలేని సౌఖ్యముబవంతులబాపుట కేగుదెంచుటన్. 110

క. అనుచున్నారదమౌనియు
వెనువెంట నరసువినోద విశ్రుతియుగళిం
జనిపోవుచునుండంగను
మనుజులజాడలు దివిజుల మంత్రములయ్యెన్. 111

ఉ. పావననామధేయ వనబంధురశీతల వాతధూపముల్
సేవలుజేయుచుండు గుణశీలుఁడు ప్రాణుల నాసికాగ్రపుం
దీవుల సంచరించు మరతిఁప్పుడు గంధపుగీలుబొమ్మ సం
భావనలేనిచోటవని ప్రాపునలేదనువానిఁ జూచుచున్. 112

ఉ. వారికిజంకు వాయుధనవారిధియూర్ధ్వముఖంబుఁజేర్చు స
వ్వారికిఁ బట్టుకొమ్మ నరపాలుర భోజనపక్వధామ మె
వ్వారికిఁ బుట్టినిల్లనఁగ జ్వాలలు కాయమునిండియుండి తీ
ర్మారులు జేయుచుం జ్వలనరంగముఁజూచుచుఁబోవుచుండఁగన్. 113

సీ. మృతకళేబరబీజ వితతులఁదగహత్తు
కీలాలపర్వతకేళి యనఁగ
బరభామినీరత పాపకర్మలబట్టు
యూపధ్వజవిభవ రూపమనఁగ
బరధనాన్వేషణ పాములంగట్టి
శరములదట్టు పరిశస్త్రమనఁగ
బరపీడ నన్నృతసంకరకూటసాక్ష్యుల
మర్దించు మాతంగ మర్దనియన
గీ. వివిధబాధలనార్పుల విఱ్ఱవీగు
కాలదండధర యమధర్మాలయమును
ఘోరభీభత్ససాకార వీరుఁజూచి
భయవిషాద సంతుష్ట వివర్ణులగుచు. 114

క. కన్నులకానందము సం
పన్నులభోగములఁగనుచు స్వర్గమునీడన్
మిన్నుల మంటపమధ్యపు
తిన్నెలఁగూడును వెలసిన తీక్ష్ణసు తేజున్ 115

ఉ. మేనున వేయికన్ను లలివేణువకూటమి భోగసాంద్రుఁడా !
మానవరాజయోగవరమానసరాజ విహారహంస సం
ధానముసంఘటిల్లు దినతారలమాలను గూర్చితిన్నవ
ద్మాననభూషణంబులను మాన్యుని జేయు మనుష్మునింగనన్. 116

ఉ. మానికి మానవాంధ్రునకు మానుగ నింద్రసుమిత్రుఁడోయనం
బానసుదేర్చి మానవసువర్ణసుధాకర పాదపద్మముల్
పూనికతోడ మాగృహము పూజ్యముఁజేసితి నాదు భాగ్యమే
గానము చాకచక్యముల కాళ్లకుబందములయ్యె నారదా ! 117

ఉ. కలహాపు బువ్వ రేఁడు సురకాంతుని మానవగాఢపీడనం
బలుకకు భీతిఁజెందఁ నరయజ్ఞవిధాత నరోత్తమాధికున్
నలువభవాప్రియాచ్యుతుల నాగరలోక నితాంతసౌఖ్యముల్
కలుషము బారిపోవునటు కామవిదూరునిజేయుజూపులన్. 118

ఉ. దేవవిమానమెక్కి నరదేశికభోగులు పైకిఁబ్రాకు నా
నావయనంగవైభవము నాట్యముఁజేయుచుఁ బద్మలోక సం
భావన పద్మనేత్రి వనపంకజపాణుల పాదపద్మముల్
దీవులు మెండుమై మనెను దీక్షసుదృష్టికి మూలగోళమై. 119

శా. పాపౌఘంబుల ప్రోగుపారి నలినోత్పన్న ప్రజోత్పత్తి మా
యోపాయంబున సూక్ష్మబీజతను భోగోద్రిక్త సంవాసమా
రూపానందముఁబొంది యోనిగతసామ్రాజ్యంబు శోకార్తిచే
వ్యాపారంబులఁదీర్చు సృష్టిగని వ్యాఖ్యానంబు నువ్వొత్తగన్. 120

శా. పాపాంతంబున బ్రహ్మలోకసుఖసంభావంబు శోభిల్లఁగాఁ
గూపాంధంబు జితేంద్రియాక్షర సుఖోన్మూలంబు ఛేదించి స్వా
రూపస్థానముఁజెందఁబోవు తమిమారోల్లాఁగఁ గల్పాంతము
న్నాపోజ్యోతికి మూలమైకలియు మోక్షానంద సంరంభమున్. 121

సీ. నాలుగుమోములు నాలుగువేదని
నాదముల నపుడు నళినమునఁగఁ
దలవాకిటంగల తల్లిని సంధించి
స్వరములఁదిలకించు వరుఁడనంగఁ
బంచభూతమ్ముల బంధించి సూక్ష్మాండ
తనువులసృష్టించు తాతయనఁగఁ
దంద్రిమాటలు జవదాటక పద్మాస
నస్ఫూర్తులంగూర్చు నాథుఁడనఁగఁ

గీ. బద్మగంధుల ప్రాకట పక్షపాతి
గాన నారద తుంబురు గాయకపతి
బ్రహ్మనిష్ఠాగరిష్ఠుల పాదచారి
నలువశోభిల్లు మానస నలినమనఁగ. 122

ఉ. మానవరూపధారణలు మాధవలోకనివాససౌఖ్యముల్
పూనికతోడఁ బొందుటకుఁ బూజ్యులు విద్యలభోగకాముఖుల్
మేనులుదాల్చి కర్మయుతమేదిని మానవజన్మబొందకే
మానసరాజ్యమోక్షపదమంజులబంధనువీడ దద్విధిన్. 123

ఉ. తేటయొనర్చునార్భటిని దిక్పతి మానవరూపపూజ్యునిన్
మాటునఁగూర్చి దేవరసమంజసభాస్కరపూర్ణతేజు లే
పాటికిఁ దారుమారు హరిభాస్వదపాయ వికారరూపమున్
మేటివినోదవాక్కులకు మేలిమికాయముఁజూపనెంచియున్. 124

గీ. వాసవ భవదీయాజ్ఞకుఁ బాత్రుఁడగుచుఁ
జిత్రరూపవిధానవిచిత్రలీలఁ
గరుపు నీమానవతనువు కంటఁజూడు
తండ్రియంచు నారదుఁడు ముదమునఁబలుక. 125

చ. హరిహయకామరూపరణహాటకశైలము దాఁటనేర్చునే
మరుధరణిస్థలిన్వలచు మత్సరకారక కామ్యబీజముల్
స్థిరతరతత్త్వయోగ వనశీలరమానిలయంబుఁగోరిలఁగా
వరగుణపావనాచరణభానుఁడు మానవరాజి యోగిగాన్. 126

శా. జ్ఞానాగ్నిస్ఫుటకామబీజములు సన్న్యాసంబు సంధించకే
మానీశానదృష్టిగోచర సుసామ్రాజ్యంబు చేకూరునే
ధ్యానాధ్యాత్మను యోగిపుంగవునకున్ దగ్ధంబుగా కేయిలన్
జ్ఞానాంభోనిధి దాటునావ నరవిజ్ఞానాంక నిష్కామ్యమే. 127

శా. గోగర్భంబున సర్వలోకములు సంకూటంబు ప్రాగ్జానిచే
భూగోళంబున నశ్వమేధవిధియే పూర్ణాప్తకామ్యాండమా
భోగోద్ధారక వాజిగోగణము సంభోగించు మార్గాఖ్యకున్
మాగోత్రాత్రితలమానవేంద్రితను నిర్మాణంబు నీడైమనన్. 128

ఉ. బంధము త్రెంచివేయుటకు బంధురమైన హృదాంగపద్మసా
గంధము మానసోజ్జ్వలనికాయవిచక్షణ సూక్ష్మదేహముం
బంధయటంచు మానవుని ప్రాకటసృష్టిని జ్ఞానచక్షువున్
సంధిలఁజేయ స్రష్టఁడన శాశ్వతమోక్షము కంటఁజూపుచున్. 129

గీ. వరలు మానవోత్తమహంస పరమహంస
మానసజరాజహంసకమలసుతాను
రంజకవిమానహంస మరాళపించ
కలితహంసతల్ప కమలగర్భుని కరు
ణారసమునకు పాత్రితానంద మొదవ. 130

చ. పలుకులపండ్లచెండులకుఁ బట్టపురాణి సువర్ణహారముల్
మలుపుచునుండు భర్తగృహమంగళలక్ష్మిని మాయగొట్టు భూ
లలనకు భూషణాంబరము లక్షణయుక్తము కాళిదాస వా
క్ఛిలయము తద్ధనాధికుల కిన్నరగానము వేణునాదముల్. 131

ఉ. నీడనుహంసవాహనుఁడు నిశ్చలతత్వము తెల్లనౌను నా
జాడ్యమురంగు పాండుగిరిచంద్రుని బంధురవేదవాదులే
నోడలు బండ్లుజేయుఁ బురుషోత్తమభవ్యకథావినోదముల్
కాడలుదీసి మంగళకుఁగంకణముంచెను నారదామరా! 132

శా. గ్రావోన్మత్తహిరణ్మయాంతక హరిప్రాసాదమోక్షప్రదా!
నానాగ్రోసరచక్రవర్త్యదధికన్యారత్న భాగ్యాస్పదా!
గోవర్ధప్రళయాబ్ధి శేషశయనోద్ఘోషాబ్జపిండప్రదా!
భావాతీత విభాకరోష్ణనయనాభాసాత్మ దండప్రదా! 133

తృతీయాధ్యాయము.

# శ్రీ

# కృషీవల విలాసము.

## చతుర్థాధ్యాయము.



క. కరుణాకర రత్నాకర
వర కమలాకర రవిశశిభాజ్నయన విభా
కర భక్తజన రమాకర
పురుషోత్తమ సుకర తీక్ష్ణ మోక్షాకారా! 1

శా. వాణీవాక్య వినోదవల్లి నరసాభాగ్యేంద్ర మానీశులం
బాణిద్వంద్వము జోటిఁబట్టుచును సంభావించు రాయుంచపై
వేణీమండలమధ్యరంగమున నుర్వింగప్పఁగాఁబోవు గీ
ర్వాణీశార్ధశరీర భోగగిరి సామ్రాటోర్వీకం జూచుచున్. 2

సీ. సర్వాంగభూషిత చందనగర్భము
పంకాంతరూప శోభస్కరంబు
సర్వార్థదాయి విశాలాక్షిసద్మము
రాజీవకాంచన రంగసీమ
సర్వమంగళవన శార్దూలవిభవము
నీలాళిమోహన నిర్గతంబు
సర్వతోముఖ ముఖసారనినాదము
పుణ్యతీర్థాచార పుష్కరంబు

గీ. సర్వపాపనాశన రణస్వచ్ఛగంగ
కేశపాశవలయ వనకీలినధుమ్ము

దేహమాలిన్యదోష విదేహబుధులు
స్నానజపములఁ దీర్చుచు శాంతిఁబొంద. 3

## —♦ కైలాసానుభవము ♦—

సీ. భుజగభూషణ సువిభూతి సూచించు కాం
చనగర్భధామము సందడిల్ల
గజముఖ సుందరీగానము శోధించు
వాహినీనాదము ప్రభవహిల్ల
సుజనమిత్రాండజ శోభనగీతముల్
భేదించు కిన్నరీవాదమెల్ల
విజన శ్మశాన ప్రవేశికారవమును
ఖండించు విద్యార్థిపిండులల్ల

గీ. వర హిమాంబుపూరంబు విభ్రాజమాన
ధవళదీధితి వెల్గొందు పవననిలయ
సకల భూతిహేతుఖ్యాత సాధుజన వి
హార కేళి కైలాసాద్రి బారఁజూచి. 4

ఉ. తోరపుబొజ్జలోపలను తుండము విద్యలసారమెల్ల మై
జారుచుఁ బొంగిపొర్లలలు సాంద్రమదేభనిరోధ భూతమై
చారువిశాలలోచన నిశాచరదర్శన విఘ్నరూపమా
దారుణగాత్రమున్వలచు ధన్యుఁడు మూషికవాహనుంగనన్. 5

గీ. వర నమస్కారబాణ విభ్రాజమాన
ప్రచురహస్తాంజలీరణ రాజ్యభార
మహిమ కన్గవఁ ద్రిప్పుచు మందగమన
భూసురఖ్యాతిఁబొంగుచుఁ బోవుచుండ. 6

ఉ. సుందరవాహినీశిఖిజ శోధనదేహి విదైత్యులేమనన్
సింధువులెల్లదాఁటి రణశిక్షలదక్షతకల్మిఁ బెంపునం
జందనశైలమునన్మదసి శాశ్వతకీర్తికిహేతుభూతమా
వందనశోభనుంబడయు బాహులతేనిని జూచునంతలోన్. 7

గీ. ప్రమథగణములు ప్రస్ఫుటభాగవతులు
భూతి రుద్రాక్షమాలికా పుష్కరశయ
నేతివేదాంత సిద్ధాంత నిష్కపట జ
ప ధనయజ్ఞవేత్తల వేదభాషణములు. 8

సీ. సత్యార్థదాయినీ సత్సంగ నిష్కామ్య
కర్మకు నేయింతి కన్నతల్లి
సౌఖ్యార్థగేహినీ సద్వ్రతపావన
భూతికి నేమాత పుట్టినిల్లు
సత్యార్థవస్తువిచారణ చారిత్ర
కూటమి కేయమ్మ గుమ్మటిల్లు
శాశ్వతానంద విశ్రాంతి జేకూర్చు రా
మకథల కేరామ మరుగుటిల్లు

గీ. సకల శాస్త్రవరోపనిషత్తులరుచి
రామనామసంస్మరణ మంత్రింబునందు
నూరి గోలిన మంగళఁ బారఁజూచి
తత్వపానతీర్థంబునఁ దనివిదీర. 9

ఉ. మాధవపాదతీర్థరసమాధురి బేర్చుచు శంభుమౌళిపై
ఖేదముఁబూని ధాతనరకీలిత చక్రికి చెమ్మరిల్లి వ
జ్రాధికహస్తశూలమున రాజిలి ముత్తెపుచిప్పలై విశా
లోదరశీతశైలమున నుబ్బుచు గంగయనన్వనింజనున్. 10

చ. జలధరకేశపాశ గణసంపద లాటలు సర్పరాజి లే
వలపులు భూతిశోభనము భాగ్యము భిక్షము మన్మథాంగముం
గలయఁగదుమ్ము జేయనగు కన్నులు గంగయు నెత్తికెక్క మే
ల్ఫలమగు సర్వమంగళనుబట్టె తదీయ శరీరమధ్యమున్. 11

ఉ. ఆసనసిద్ధిగూర్చి మితహారవిభూతిని నాశికాగ్ర భూ
శ్వాసలబంధనంబొరపి చంచలవర్గము రూపుమాపి మే
ల్వాసనలన్ని కాచి సువిభాకర తేజము బ్రహ్మారంధ్రి స
న్యాసముఁబొందిముక్తిఁగను నాగముభోగము యోగభోగమున్. 12

సీ. పద్మాసనాభ్యాస పారాయణరతుల
నిస్సంగరహితుల నెరపకున్న ?
బ్రహ్మవిద్యాభ్యాస బాదరాయణుల స
త్సంగప్రపూజ్యుల సలుపకున్న ?
నిష్కామ్యకర్మ భూనిలయ ప్రవీణుల
నిర్మోహసిద్ధుల నెరపకున్న ?
నిర్మలతత్వజ్ఞ నిఖిలేశభక్తుల
సన్మోక్షకాములఁ జలుపకున్న ?
గీ. సర్వయోగశాస్త్ర నిపుణసంగవర్జి
తగుణ దిగ్గజశ్రేష్ఠులు ధరణిఁగూడి
కన్గవనుమూయుచున్ యోగకాంతులలర
నిశ్చలజ్ఞాన ధౌరేయ నిలయులఁగని. 13

చ. స్థిరతర తత్వపానసురసింధువు తేజము మిన్నుముట్ట శాం
బరవనభిల్లు కంఠగత పాశము లూడ్చుచు సర్పమాలనా
భరణములంచు సంశయముఁబాపి వినోదముఁగూర్చు చూడఁగం
బరమపతివ్రతా స్సుగుణమంగళసూత్ర మహత్వ మెట్టిదో. 14

ఉ. శంకరదాసపాద గుణసంగమతీర్థము గ్రోలు భాగ్యముం
బంకములెల్లఁ బాయు సురవర్తనమబ్బు విభూతిశౌచమున్
వంకలుదీర్చు దర్పగణపాశములూడ్చు విశేషధారణన్
సంకులసక్తివీడు గుణసత్వముచేకురు జ్ఞానమబ్బుఁగన్. 15

శా. కర్మాభ్యాసనియోగధీయుతుఁడు నిష్కామాంగవిస్తారుఁడై
నిర్మాలిన్యమనోజకామగణ వేణీబంధమొప్పారఁగా
ధర్మాదిత్య వివేకశాంతగుణవిద్యారూప విన్యాసమహా
కర్మానందవితీర్ణ తత్వఘనవిఖ్యాతుండు గాకుండునే ! 16

ఉ. స్నానము సంధ్యహోమదినసంస్మరణాగము బ్రహ్మయజ్ఞమున్
దానవిధానసంజనిత ధార్మికయజ్ఞము దేవతార్చనం
బానవిధోక్త ధర్మయుతభానరయజ్ఞము వైశ్వదేవమున్
వీనులవిందుఁగూర్చు సురవీక్షణమబ్బు గృహస్థ ధర్మముల్. 17

సీ. సర్వేశ్వరుఁడు ప్రాణసంగమలింగమై
తనరార శివపూజ తలఁపులేల ?
అంధకరిపుఁడు సదాదిత్యుఁడై వెల్గ
రామసత్పూజలు రాతికేల ?
గంగాధరుండు నిస్సంగరహితుఁడై త
నువుగ్రాల నభిషేకకవనమేల ?
ఫాలనేత్రుఁ డనలవర్ణుడై పచరింప
ధూపదీపంబుల తాపమేల ?

గీ. దేవతార్చనముదొడరి దేవళముల
లింగపూజాభిషేకము సంగవిధిని
వివిధనీరాజనంబులు భవభయంబుఁ
బాపి సన్మార్గవర్తుల వరలఁజేయు. 18

సీ. కర్మసన్న్యాసము గావించు టేవిధి
సంకల్పబంధము సంచరిల్లఁ
బ్రాణనిద్రాసక్తివర్జన నెటుగర్పు
విశ్రాంతివేదన విస్తరిల్ల
కామరాగాళులఁగాల్చుట యేవిధి
విమనఃకృతాంధము విస్తరిల్లఁ
బ్రాణవాయువులను బంధించు టే విధి
కామచయంబులఁ గాల్చుకున్న

గీ. సర్వకర్మంబులంజేసి సత్యవిధిని
గామవర్జితత్యాగము ఖ్యాతిబ్రబలఁ
దదనుచరణులు పూజ్యులు ధరణిలోనఁ
గర్మయోగులై శాంతిని గాంతు రెపుడు. 19

సీ. కర్మమో శాంతమో ధర్మమో దాంతమో
జడలసందున గంగ జగడమురయ
నాత్మమో రామమో యజ్ఞమో భూతియో
మంగళవాఙ్విద్య మహిమమెఱయ
విఘ్నమో భగ్నమో విద్యయో బుద్ధమో
మూషికవాహనమూర్తిమెఱయ
యుద్ధమో దగ్ధమో బద్ధమో బాహులో
సుకుమారగాత్రుని శోభ మెఱయ

గీ. వాయుభక్షణయోగ సర్వవిభవములఁ
దద్రిసదినపానమహిమ భద్రికృష్ణ
గళవిరూపభూత పిశాచగణనిధీశ
శివసుధాపానభోక్తలు చెంతనుండ. 20

క. ఖేచరముద్రల ముక్కల
భూచరవర్ణ మిథునాంకపోషణ కేళీ
ధీచరమధ్యమ సాధన
గోచరషణ్ముఖ సువర్ణకూటముతోడన్. 21

చ. శివగిరిశైలదేవతలు సిద్ధినిబొందుచు నుండ సంతలో
భవహరనీలకంఠ వరవర్ణుఁడు కన్గవచూపులోతులోఁ
బవననిబంధనంబుఁగని ప్రస్ఫుటకాంతుల నిగ్గులాగుచున్
భవనసుసాధనాంగము శుభంకర షణ్ముఖముద్రజారిపోన్. 22

ఉ. నారదమౌనివర్య సురనాథుఁడు ధాతయు మానవాంగునిన్
వేఱుగ వెన్కనుంచుకొని విప్రసుభాషణ విప్పళింపఁగన్
సారవివేకధర్మ నిధిశంకరదేవర సన్నిధానముం
జేరి నమస్కృతాదరణచేష్టలఁ జిత్తము పల్లవింపఁగాఁ. 23

ఉ. మానవలోకవాసు లనుమానములేకయ వాయుమార్గమున్
స్థానముఁబట్టి స్వర్గశివశాశ్వతలోక విలోకనంబు వి
జ్ఞానవిరోధవర్గముల ఖడ్గనిరోధముఁజేయుకోర్కి త
న్మానసరాజహంస శివమాధురిబోధముగ్రోల వేడుకన్. 24

ఉ. వాయువిమానమార్గమునఁ బ్రాజ్ఞుఁడు భక్తిని బట్టుకొమ్మని
శ్రేయవికల్ప సంకలితచేలసుమాడ్చెను దేవదిక్పతిన్
నాయువుపోయు దేవరలయానసుమీఱఁడు సంతసంబుచే
సాయము జేయుమయ్య మనసారఁగ నారదుమాటమీఁదనున్. 25

ఉ. నారదమౌని ముంగిటను నమ్రసుభాషణలాడుచుండ వా
క్సారథి ధీవిచారణ విశారదదీప్తిని హెచ్చరించె దే
వా! రవితేజమార్గమున వారధిజీవుఁడు దాటురీతి నీ
చారనివేది భస్మఘనసంగమరూఢిని దొక్కులాడుటన్. 26

ఉ. వీనికి జ్ఞానవీక్షణ వివేకము బోధముసేతువంచు నీ
సానులు దేరిచూచుచును స్థావరమేర్పడ సన్నిధాన సం
ధానముఁజేరి శుద్ధనిజతత్త్వము వీనులవిందు గూర్చుమేల్
ధ్యానము ముచ్చటించి మము ధన్యులఁజేయుము పార్వతీపతీ! 27

ఉ. కూటికి గుడ్డకున్వొరచి కుత్సితచేష్టలబుద్ధినిల్పి మో
మోటమిలేక దర్పవచనోదితమాత్రల దైవభక్తి యే
చాటను దేరిచూడకను పాపపులాంఛన ముద్రియంత్రమౌ
కూటమి లోకవాసులకు గుప్తము ధర్మము విద్యలేనిచోన్. 28

ఉ. విత్తము పూజ్యమౌను ధరవిద్యలనన్నిటి డబ్బులాగుటే
యుత్తమకార్యమంచు మది నుబ్బుచు రోజునకొక్కమారయేఁ
జిత్తము భక్తిమార్గమున సేవలనొల్లక పొట్టకూటికై
తత్తరపొందు మానవుల ధారణశక్తులు లేశమాటచేన్. 29

చ. నిరతము దేహగోష్ఠిగల నీరసవృద్ధులు భక్త్యుపాసనం
బరుగదు ధర్మమార్గమున నాగరుబుద్ధియ సూక్ష్మరూపియై
పరుగిడు మోక్షశిక్షణల వర్జితకాములు రుద్రమూర్తివై
నరవర జన్మపావన సనాతనదేహికి విద్యఁగూర్పుమా! 30

ఉ. నాదగుసృష్టి లోకమున నందనచందనసారభూజముల్
కాదను పక్షువర్గములు కాంచనగర్భులు వేనవేలు నా
మీఁదను వానినన్నిటిని మించినక్షేత్రము మానవాత్మయే
సాధనజేయు సాధుని సన్నిధిఁజేర్చితిఁ జిత్తగింపుమా! 31

ఉ. తాత విధాత వజ్రినర ధార్మికవర్ధన మేళవింప నే
కేతువుఁబట్టి త్రిప్పుటలు కీలికి నౌషధసేవకీలమే
నీతులుఁగూర్చ నేర్పరులునిర్మలచిత్తులఁజేయ ధూర్తతే
పాతకనాశనంబునగు సంధనుబట్టక శాంతిఁగూర్చునే! 32

క. అనుచును భీముని పలుకులు
వనజాసన వాసవప్రవరదృష్టిఁ దగం
గనకాభిషేకము కలిమిఁ
గనిమీయభిమతముఁదీర్తు కరివరదుదయన్! 33

క. నరవర మదీయ సన్నిధి
ధరవరనిశ్చలనిదాన దానవనిష్ఠం
జరణ విలోకనభూతిని
పరమగురు శ్రేష్ఠ మంత్రి పాత్రునిఁజేతుక్. 34

గీ. రౌద్రిరుద్రాక్షభూతి వైరాగ్యము్బ
దర్పకాధీనకార్పణ్య తంత్రములుక
భక్తిఁ జిత్తశుద్ధ్యనిశము బ్రజ్వరిల్ల
సాంధ్యసావిత్రిఁ జపియించు చదువుఁజెప్పి. 35

ఉ. తారకరామనామ గణధార్మికమంత్రము సర్వపాప సం
హారముఁజేయు సత్వవిమలాస్త్రము దేహినిజుట్టిబట్టు హం
కారముభూతిరూపమునఁగాల్చు వికారములారిపోవు శృం
గారము మాడిపోవ రవికాంతులదేహియు రామమా త్వరక్. 36

క. యోగులకిది దివ్యౌషధ
భోగము రేపవలుపరతిబోధమునిచ్చుక్
రాగముమాని నియమిత
త్యాగముజపింపుము సుమితాహారవిధిన్. 37

గీ. పార్వతీరామపరిశుద్ధ పాశుపతము
సర్వమంగళాసిలసుత జనకధర్మ
పావనశుభాక్షరసుతతి. భార్గవగుణ
కాండసంహారమంత్రము కదిపిచూడ. 38

క. జనకుఁడు జనకజ తన్నా
మనవమరుజనక వరనుత మందర కేళీ
జనక సుధాద్రివమోహము
దన విభ జనకర్తకిచ్చి ధన్యతనొందెన్. 39

గీ. శుద్ధపంచాక్షరీతపసూత్రిగణము
వరుసఁ బంచేద్రియంబుల మరుగఁబెట్టి
పోసఁగఁ బ్రారబ్ధసంచిత పుష్టచయము
పుష్కరానిలాబ్ధింబట్టు స్ఫూర్తిమెఱయ. 40

చ. శివభవరామరాములకుఁ జిత్రితభేదము లోనలేదు మా
ధవ శుభనామధేయమును దాంతునిదృష్టికి నేకపింగమా
దివిజసురాంగభేదముల తీక్ష్ణసువాదము సంఘటిల్లనే
నవరసపూర్ణభోజనము నందనభోగ్యము భేదదృష్టిపోన్. 41

క. నారాయణ నామకలిత
పారాయణజపతపములు పావను జేయన్
సారాచారసుబోధము
ధారాధరదానమహిమ దాంతుని జేయున్. 42

ఉ. కన్నులఁదేలఁగొట్టి కళకాంతులమూర్తిని ప్రజ్వరించి పో
వెన్నెలతేని మిన్నదర మిత్రునిదీప్తిని నుగ్గడంచు సం
పన్నులఃపత్ప్రఫ్రణవభాస్వర నాదవిలోకనంబుచే
వెన్నునిజేర్చుముద్రి యిది వీక్షణమబ్బిన శాంభవీప్రభన్. 43

శా. బ్రహ్మప్రోద్భవ వేదసూత్రములు విప్రఖ్యాత విఖ్యాతితో
బ్రహ్మజ్ఞాన విధానదీప్తులను కర్మప్రాజ్యసుజ్ఞానమై
బ్రహ్మంబేనంటుతంచు బుద్ధి మదిసంభావింప నిష్కామ్య మా
బ్రహ్మానందము గూర్పకుండునెటు నిర్మాలిన్య క్షేత్రజ్ఞులన్. 44

శా. చూడంజూడఁగ వృత్తినాశనమునుం జోకొట్టు హంకారమున్
వీడంగొట్టు మనోజశత్రుచయ సంప్రేక్షాంధకారంబుపై
జాడంబట్టు వివేకదృక్పథము వ్యాసంగంబుఁ జేకూర్పదే
నీడంబుట్టిన నిర్వికల్పరస నిర్నిద్రప్రబోద్దీప్తిచేన్. 45

శా. నాదంబొక్కటి గానుపించు వినఁగా నానందమే పారఁగా
వేదోద్ఘోషనినాదమో సరసదృక్పిండాండసంయోగమో
బోధాకర్షపరాత్పరాత్మ నిజసంభూతోగ్ర సంఖ్యార్థమే
నాదంబై విలసిల్లుఁ జూడ పరమానందానుసంధాయమై. 46

ఉ. మోహముఁద్రుంచివేయుమిఁక మోసముచేకురు మారుమాటలే
మోహపుద్రిమ్మరీడు నలుమోములవాకిలిదొడ్డనేపు స
న్మోహన శస్త్రధారణము మొగ్గలఁబూవులరాలఁగొట్టు నా
మోహిని స్వార్థగీతములు ముగ్ధవిహాళికి మేఘమాలలే. 47

గీ. నిర్వికల్పసమాధిని నిష్ఠగరుప
ముక్తదేహవాసనదీప్తి మూర్తిగరిమ
సర్వలోకపరాత్పరాంశమునఁ దన్ను
సాక్షిగాఁగను జిత్తైక్యశాంతిదొరకు. 48

గీ. వర జితేంద్రియమానస బాలపాప
విషయగోచరతన్మయ విమలచిత్త
బింబబింబితాహంకార గుంభితాంత
రాత్మశూన్యుడై జూపట్టు నంశులలర. 49

గీ. సర్వసంగసన్న్యాసికి సమ్యగుగ్ర
మోక్షపదసాంఖ్య విజ్ఞానము నిలయమ్ము
క్లిష్టతరకాయశోషణ కేతువగుటఁ
బ్రథమయోగ విద్యాభ్యాసికిఁ దరమౌనె ! 50

మ. కలికాలంబున యోగధారణ రతైక్యస్ఫూర్తిఁ భాసిల్లునే
కలకాలంబును దేహసౌఖ్యముల మూకంద్రోలి నిర్జీవమై
యిల మానాభివికారమానసుల నన్నింటిన్సమానంబుగాఁ
గలయంగూర్చు ప్రశస్తశక్తిగల నిష్కాముండు గాన్పించునే. 51

ఉ. కావున శక్తిహీన నరకాంతులు కష్టతరంబు కార్యముల్
చేవను జేయఁగాఁ జనరు చిందని సౌఖ్యముఁ బొందు మార్గమున్
నీవును జేయ శక్తిగల నిర్మలయోగ వివేకవర్తనుల్
త్రోవను జూప నేర్పరులు దూఘవివర్ధన రాజయోగులే ? 52

గీ. వ్యాసవాసిష్ఠ కపిల విశ్వాదిమిత్రి
జనక సనకసనందన శౌనక శుక
నారదాత్రేయ కాంపిల్య పారిజాత
తరుల కాలవాలము సాంఖ్యతత్త్వశక్తి. 53

ఉ. వారలు బ్రహ్మభావన నవారణధారణ సాంఖ్యయోగముఁ
దారులుద్రొక్క వేదవిధిఁ దత్త్వవిశోధనచే స్వకీయమా
ధీరవివేకబుద్ధి నలుదిక్కుల వ్యాప్తముజేయలేదె! యీ
సారవివాదమే యుపనిషత్తులు సాధనజేయని మాటలేటికిన్. 54

గీ. భీమదేశికబోధము రోమహర్ష
ణంబుగరుప నిశ్చేష్టుఁడై నరుఁడు తెల్ల
బారి వేధేంద్ర నారదపాదకంజ
రేఖలంబట్టి సన్మార్గరీతిఁ బలుకు. 55

ఉ. చంచలమైన మానసము శంకర నాకిల శక్యమానె ప్రా
పంచికవాసనార్థములఁ బాపుట మానుషజాతికబ్బునా!
పంచశరాకృతాంధ తమ పాపవిమోచనఁ జేయుమాడు నీ
పంచను దీరుమారితిని వారిధిఁ జేర్చుము చంకజోలినిన్. 56

క. నెప్పుడు శాంభవి కరుణా
భావకళానిధి వివర్ణభాంకృత మాయా
దేవినిబుట్టిన మానవ
జీవికిబోధించు మందు జీవైక్యంబే! 57

గీ. అని మదిని సర్వకామ్యమననమునండ
మరలఁగొట్టి యాత్మామృతామలకమల వి
నోదవృత్తిని దృప్తుఁడై నాదు బిందు
కళలకు నతీతమౌ ప్రజ్ఞగానిపించు. 58

గీ. కూర్మము తన యంగంబులఁ గూడఁగట్టి
లోనికిన్లాగు నేర్పున లుబ్ధసంచ
లేంద్రియంబుల విషయాబ్ధు లింకునట్లు
మరుపుబుద్ధియె ప్రజ్ఞయై మహిని వెలయు. 59

క. అర్జున వరనారాయణ
వర్జితక్షేత్రవితరణ వివాదాభ్యుదయా
గర్జిత నాళవిభేదన
దుర్జననాశనము గరుపు దోర్బలభూతిన్. 60

ఉ. యోగము కష్టసాధ్యమగు యోధుఁడ యోగము కన్నసూక్ష్మమౌ
భోగముజూడఁ జూడఁగను బుద్ధికి గోచరమౌ విధానమే
త్యాగము లేక కన్పడదు ధర్మము సత్యము యెంచు యజ్ఞముల్
రాగములార్చి పెంపెసఁగు రంగము ధాత్రిని గానుపించునే? 61

చ. అనయము భక్తిమార్గమున యంతటికన్న విధాన మొండు లే
దనిశము ప్రేమతత్త్వమున నాటలు సత్పురుషాళిసంగముల్
మననము ధర్మసత్యపరిమార్గము దాంతవిధేయ శౌచముల్
వినయము విద్యగూర్చు ధర వేల్పును జేయక శాంతిఁబొందునా? 62

క. కర్మానందము మించును
ధర్మసమావేశసత్యసమశాంతముచే
భర్మరమావిభవోజ్జ్వల
నిర్మలబుద్ధిన్మలుపుచు నిర్గుణుజేయున్. 63

చ. జనవరచిత్తశుద్ధి భువిసత్వము నిర్మలగీతగానముల్
ఘనతర శాంతపేక్షణవికార మనోభవకామ బీజముల్
వనచరవృత్తిఁబూని కనుభక్తి విలోలవితీర్ణ పూర్ణశో
భనగణమోక్షసౌఖ్య రణఫల్గుణధీర వివేకధీధితిన్. 64

ఉ. నారద శారదారమణ నాగనివాసవిపక్ష మర్త్యునిన్
వారధిదట్టి మట్టితిని భాస్కరపద్మ విలోకనాంశునిన్
సారధిసానబట్టుటను సాధనజేకురు శాస్త్రవాసనల్
ధారణయంత్రయోగబల ధర్మవిచక్షణ పాంచజన్యమున్. 65

గీ. భక్తివిజ్ఞాన వైరాగ్యభాగ్య యోగ
సాధనలదార్చి నూరితి సానఁబట్ట
సత్వశాశ్వత సామ్రాజ్య సాధనలకుఁ
గుదురు నాచేతిమాత్ర వైకుంఠయాత్ర. 66

గీ. మనము సర్వప్రపంచము మరుగుబట్టు
దానిని వశంబుజేయను దక్షుఁడెవఁడు
మత్తకపిచరవృత్తిని మసలుచుండు
తరచి కాపాడుప్రాజ్ఞుఁడు దాటునుదధి. 67

ఉ. బొమ్మనుమించు బోధనము బూడిదబూచిని గుమ్మరిల్లు నా
కమ్మని సృష్టిజేయు కలికాంచనగర్భిణి నారదాంశమై
కమ్ములుగూడ చారి తిలకమ్ముల చేదినవాణికన్న పొం
దమ్ముల నీడదేరునలితక్షక హేతిని జూపునీడలోన్. 68

చ. పరమశివప్రభాకర నివాసుఁడు భూతినిరుద్రమాలికా
భరణమునిచ్చిపంపు నరవర్యుఁడు శంకరనామనోజ్వై
తరణిని సానఁబట్టి సరుధన్యుని జేసితి పూర్ణధన్యునిన్
గరపు విధానమెందుఁ గలకాలము నీశరణార్థిఁగావవే? 69

గీ. అనుచు పాదకంజముఁబట్టు నార్తి సిగని
నారదమహామునిపలుకు నరసరదుఁడ!
కనికరమరయు దినకరకరివరదను
విభవభూషణపురమున వీడిపోవు. 70

గీ. శివశివ నమోస్తు సత్యప్రశిష్టసిల్పి
భవభవనమోస్తు నాకప్రభావిశిష్ట!
హరిహరినమోస్తు కలహప్రహాసవిష్ణు
యంచును విమానమెక్కి-రి యమరతటిని. 71

—♦ వర్షవిషయము ♦—

చ. పెళపెళమబ్బుబిట్టురురు పింఛమయూరనినాదగానముల్
గళగళమంచుబుట్టి చలిగాలి సుడిన్వడగండ్ల పాలైమై
బళిబళి! యంచుఁ గోకిలల భైరవదృష్టుల యజ్ఞధూపముల్
మలమలమాఁడిపోవఁ బడుమాలలగుత్తులు గంగధారగాన్. 72

చ. భువిఁగల జీవనౌషధుల బొబ్బలవెట్టకు యజ్ఞధూపసైం
ధవలణాంబురోదనము దక్షిణరోదసిమాళిబారి శై
శవవరుణాంగబాంధవుని సత్యతరాశయ మెచ్చరించెనా
భవళపయోజ ముక్తజలధారలు కానుకబంపెనోయనన్. 73

చ. తన యుదయాంశుధంభమునఁ దారకనాథుని పెట్టగుట్టచే
వననిధులింకఁగొట్టి రసభంగముచేతను ధూమకేతువున్
ఘనపతిబాజ్జలోపలను గాలికిదాకొనఁ జిల్లుబుట్టెనా
ననసగుబిందుధారలెనయంగను మంచును దెల్పుకై వడిన్. 74

చ. ఘనపరిభూరాష్ట్రమున్విడిచి మాధవరూపునిసాలుబట్టెనా
మనకిఁక నేమిభీతి యనుమానములేదని మ్రుగ్గుఁబెట్టె నా
వనగజరాశులో యనఁగ వారిధి భూమిని దిమ్మరించెనా
ననఘనపంక్తులంతటను యాగముఁజేయఁగ వచ్చెనో యనన్. 75

మ. చలమత్తేభకిశోరనీరదులుపోష్యంబుండి పానార్హకో
మలపంకోద్భవరాగదీప్తులను బేర్మిన్ రోదసీమధ్యము
న్నలుగెట్టంగనురాలు శీతకర కన్యారత్నసన్మాలతే
తులనుంజెందిమిణుకుర్కరన్మెఱుపు విద్యుద్దీపవిక్షేపమై. 76

ఉ. బంతులుదీర్చి విష్ణుపదవాహిని హస్తములెక్కవెట్టి రా
ట్కుంతుకలీలమైమరచి కల్వలఁగొట్టిన తారకాంగనల్
గంతులనుండిజారు ఘనకంధరధారలు భూమిపీల్చెనా
న్గంతకలాపికామినులు కోరికలూరుచుఁ గల్వరించెనాన్. 77

ఉ. మామఘురాజయోగవిధి మాధవలోకనివాసమైచనన్
శ్యామలనీలమేఘఘనశౌరి వివేకధురీణబుద్ధితో
క్షేమముఁజూడఁగోరి సుమనిర్మితమౌక్తిక వర్షధారలం
దూమిడిచెట్టగొట్టెనన దుందుభినాదము లుట్టిమెట్టిలన్. 78

చ. ఇనుఁడుదయాద్రినెక్కి గిలిగింతలనబ్ధినిబీల్చి సారమున్
ఘనరసనాకభాండమును గాపురముంచిన పద్మవైరిమై
ధనవిభవాభిశైత్యమునఁ దన్మయమేటికి జిడ్డుబుట్టెనా
నసనగు నింద్రచాపవిధి యానకులోఁబడువారి జీవముల్.

చ. తన కడుపారఁగన్న తలిదండ్రులమేరనుమీఱి శూన్యమై
ఘనజముఖైకలోలతర కాంతుల వాయుకుశేశయ లోకసన్నిధిన్
వనచరవృత్తిఁబూని జడబానలధాటికి చట్టికూటికై
ఫునఁబడిజారిచేరితిసి పూర్ణపయోధర సామ్యమేర్పడన్. 80

సీ. నిర్గుణబ్రహ్మజనిర్మల తేజోసి
మాయానిబింబిత చాయయనఁగ
సర్వజ్ఞబిరుదాంక శాసనాంతఃకర
ణాంగహంకార విహంగమనఁగ
జీవజ్ఞవిభ్రాంత చిన్మయకూటస్థ
మాయాంధముద్రిత శ్రేయమనఁగ
నండపిండపిపీలికాండ సకలజీవ
పరివారసేచన పాపమనఁగ

గీ. మాయచదలందధని పురుగుఁబట్టి
పాపమేఘుని పాత్రమై పరువులెత్తి
కటికచీఁకటి చెలిమిని గట్టువడుచు
జగతి నాక్రమించుటరుదె? జడునిభంగి. 81

గీ. తదమలపరిపూర్ణ బ్రహ్మదండనుండు
తేజమనిల సంభూతమై దిశలుజుట్టి
కోటిసూర్య ప్రభాకర కుంభదీప్తిఁ
బాపజలధరముల మాపు ప్రభను వెలుఁగు. 82

గీ. కటికిచీఁకటిభీతిని గరగఁగొట్టి
జలధరసదన మాంద్యము నలుగుబట్టి
శీతకరబింబమలినము చెల్లఁగొట్టి
మిత్రసంరక్షణంబున మిన్నుముట్టు. 83

మ. పరమాత్మాంశువినోదవృత్తగత శుంభద్దీప్తిరుద్రాంశమై
నరసంఖ్యాసు వివేకజీవధనమాన్యక్షేత్ర సంభోగియై
వరలుంగూర్చిన దండదారమునఁ బ్రాభా సాక్షి చైతన్యశా
ర్వరపిండీకృత నాట్యశాః వరసారంభాంగ దేదీప్తియై. 84

చ. దినకరకాంతి నుక్కడఁచు తీక్ష్ణసు దృష్టినివారిబింబ వ
త్కసదరుణాంశ చిత్తవనదర్పణ బింబితసాక్షిభూతమై
జననమునొంది కామ్యచయసంగమునంటక వెల్గుదీపమే
మానమునఁబుట్టు సర్వజగమంగళ నాటకసూత్రధారియై. 85

చ. తనువనుగోష్ఠిలోకెప్పుడు తామరతంపరలైన దీప్తులన్
మనుపుచునుండు తీక్ష్ణమగు మాయ తదీయ శరీరధామమై
కనఁబడినవ్వియోఁతను కారణదేహిని పాచివేయునే
మని యిఁకఁజెప్పవచ్చు తనయాజ్ఞకులోబడు వారికేగతుల్. 86

సీ. పద్మాకరనికాయభాసమాన విమల
పుష్కరసజ్జనస్ఫూర్తి మెఱయఁ
బద్మాలయలలిత భాస్కరేందునయన
రాజీవకుముద వైరాగ్యమరయఁ
బద్మనాభీగళత్త్రివేదలోక సా
మ్రాజ్యసవేదిక మాయ మెఱయఁ
బద్మలోహితమణిప్రభవ కౌస్తుభ
నీరాంజనారి శోణితరవమొగి

గీ. విష్ణుపాదసీమను గడువింత పాన్పు
నాదిశేషుడు పాతాళసార్వ్యమంత
నావరించిచీగంబట్టు యంత్రితంత్రి
మార్దవంబునగూపెట్టు మహితవిధిని. 87

సీ. పాలకడలిదర్చి పాకార్ణవా వెన్న
నే వెన్నకై దండ నీవి మెరపు
నీరదమై వేణి నీరేజశరునికి
మాతమై మాధవు మననమెరుపు

లక్షణాద్యునితోడ లబ్ధపద్మాసనుల
భోగవతీసంఖ్య భూతిమెరుపు
శరదాగమ సువర్ణచంచలమైగేరు
వాక్ప్రాణిజంటను బడసి మెరుపు

గీ. క్షీరసాగర కన్యకాక్షిప్తపద్మ
సదనలాంగేలువిష్ణుపద ధరధామ
మనిశమునునున్ని విత్తుల యర్థమచటఁ
గూడఁబెట్టెనో యననగు జాడమెఱయు. 88

ఉ. మంటలమారికన్న నవమంగళధామముఁదాల్చి వాఁడు బల్
జంటలకోపతాపములసందున దాగిలిమూతలాడుచుం
గంటివినోదబాణనుల కాంతలకౌఁగిటఁజేర్చు భాగ్యమన్
వింటిని విల్లుపీగు నవవిల్తునిజూడక నిల్వనిచ్చునే! 89

దశావతారములు

చ. నలినము నాచుఁబట్టి మలినస్ఫుటమాంద్యముఁజెందు భీతినా
వలపునఁ బద్మసంభవుని పంకజవారిధిమీఁదఁబ్రీతిమై
కలకనుబంచభూతఘన కారణసృష్టికి మూలనాళమా
తలఁపునఁ బ్రాంధమైకసవతారముదాల్చినవారి పుష్పమా! 90

మ. తనయంగంబులలోని కిన్నరపువిద్వద్రాజ భీభత్సలా
వనయోగంబున మేరమీఱు లవణప్రాణాంగ సంజీవభా
జనమైరంబున నాదికూర్మకరుణాసౌగంధ వాత్సల్యబో
ధనమెల్లప్పుడుఁ గూర్చుకుండు నరమిథ్యాభక్షమితాంశమై. 91

మ. ధరచాపౌననిచుట్టఁబెట్టి సురమాత్సర్యప్రభాస్ఫూర్తి భాం
కరవృత్తింగని నాలితేరి వనసంఖ్యాపారవారాశి భూ

ధర మైరావణరోషధూమమున గంధర్వాత్మనిర్వాణ సం
భరితానందముఁబొందఁజేసె దనుజాభాసాంగ దర్పాంధునిన్. 92

శా. కరిపారాయణ వైరిమారణమునంగాకున్న వాఁడెచ్చు భూ
వరమృత్యుంజయు రాజశాసనము సన్వర్ధిల్లు మాతంగ భూ
సురభక్త్యగ్రసుతాదరైక విమతాశూన్యాంధ వైరాళినిన్
మరణాగ్నిప్రబలాంగగర్జనమునన్ మర్దించు సింహప్రభూ ! 93

మ. ధనధాన్యంబులఁ దుర్భిక్షఁజేయు దనుజేంద్ర ప్రాణవిప్రార్థి భా
జనపీఠాగురుతంత్రభేద్య రణశస్త్రంబా త్రిపాదప్ర భో
ధన భూదానము నిచ్చికావుమని పాదంబెత్తి భూనాకలో
కనిబద్ధంబొనరించి మాళినిడి ముగ్ధగ్రస్తునింజేయవే ! 94

మ. మదమాత్సర్య వికారరోషమునఁ దీర్మానైనరాజన్యులన్
వధవేమారిన వంశచంద్ర రణ నిర్వాణోగ్రచాప ప్రభా
మదనాగ్నిన్నలుపెక్కు విప్రభజనామానీశు భీష్మప్రతా
ప ధనుర్బాణ శిఖింగరంగి కడఁజేవంజూపు రామాస్త్రమా! 95

చ. నరవరుఁడౌచుఁ బంక్తిరథు నందనుఁడై వనమానిమాళియై
ధర జనకాత్మజేశ భరతస్థిర ధర్మసుశాసనాంకుఁడై
సురనిగమాగమేడిత యశోదయుఁడై హనుమంతు శౌర్యమై
పరదశకంఠు మృత్యుముఖ భావితుజేసిన రాఘవోత్తమా ! 96

మ. పురినాగేటిని జేతఁబట్టి మధురాపూర్ణాంగదర్పంబు సా
గరకన్యాచరణాంబు పాల్గలిపి సంగ్రామోర్వి దుర్యోధనా
దరవాదంబులనెత్తిఁ జేరననుజస్థౌల్యంబు పాండుప్రదా
కరమైబట్టిన మేరమీఱఁబలు పెక్కంగాని కృష్ణాగ్రజా ! 97

ఉ. చారుఁడు సత్యరుక్మదవిశారద చోరుఁడు దేవకీవరా
ధారుఁడు నిర్వికారుఁడు ప్రధానగుణేంద్రుఁడు గోపికామనో

హారుఁడు కంసభక్షకని యుంతుఁడు పాండవపక్షపాతి దు
ర్వారపరాంతకోత్సవము బంచినమాధవ రాయబారమా! 98

చ. కలుములులేని వాకిటను గాయలుగాయని చింతతోపులోఁ
జలములుమాని బత్తిగని చక్కనికోసల వెల్గుచేతలం
బలుగురుమెచ్చ బొమ్మతరిబాటను దెల్పుచు జోగిఱెంకిమై
కలయగుదీవిదాటమని కంటికిఁజూపిన బుజ్జిజేజెమా! 99

చ. కలికిమిఠారి వెన్నునకుఁ గాసులబత్తెము బోటిమాటలే
పలువురిమెప్పుదెచ్చుఁ గలవారికి బిచ్చము హెచ్చుబెట్టుచే
నలపులు సత్తెమన్న నగుబాటలు చిక్కులుకూడి బారు పో
కలుగలవేళ బిట్టురుము కన్నులవిందగు తమ్మిచూలిమై. 100

చ. కరుణ దిశావతారరణకంజనకేళిని నీదులాడు శౌ
ర్యరథికు సన్నిధింగరఁగు రమ్యమనోహరరూపు తూపుమై
మరచి విశాలలోకమున మద్గురుసన్నిధి గడ్డకట్టదే
పరమపురాణపూరుషుని పాదములంటగనంచు ధాతతోన్. 101

ఉ. నారదమౌని జెప్పుచును నృపతరంగ వికాసమొప్పఁగన్
వారలు విష్ణుపాదముల వద్దకుమెల్లఁగఁదేరిపారుచుం
జారులుగూఢవేషమున సాశయమొంతయుఁ జొక్కఁజేయుచున్
నీరజరత్న గర్భమున నిద్రలకుండలిఁ జేరిరంతలోన్. 102

గీ. మా కుమార కుమార! ప్రమథనాక
క్షేమమేమీకు సర్వత్రసిద్ధిబొంద
మానవనవలందొడ్డేర మధురలోక
వీక్షణము లివె నుందును విష్ణుపంక్తి. 103

సు. తమసాన్నిధ్యముఁజేరి సందియము సంతాపంబుఁ జల్లార్చు స
త్యముఁజూపట్టు వివేకవస్తువును నిద్రాముక్త వైరాగ్యమాం

ద్యముసం గానక పోతినంచు సురవందారు ప్రభా దాస్యమున్
మమకారంబును వీడఁగొట్టుతమిసన్మానంబుఁ గాంక్షించుచున్. 104

ఉ. తమ్ముని నిమ్ముబట్టి నడిదారులు ద్రొక్కిన నాదుచేతిలోఁ
గమ్ములుమట్టిపోటు చలిగూడల జారులమాసిపోయె నా
సొమ్ముల నెత్తిపోతలకు సుద్దులదిర్పుల నూరిపోయ నా
తమ్మునినీడమల్పుమయ! తండ్రిగనెంచుచుబొమ్మపల్కఁగాన్. 105

ఉ. నారదమౌని గానగణనాథుని గీతల సారిగారియన్
సారలు మారుమ్రోతలిడు చాతురిఁజూపుచు వీణతీగ మో
మారులు మన్ననైమెఱుఁగు మంజులనాదము లుప్పతిల్లఁ దీ
ర్మారులుజేసె విష్ణుపదరంగము తీయని గానవాణిచేన్. 106

ఉ. మాధవ! నీదుసత్వసరమద్రిధబోధనఁ గోరువారమా
వాదనలన్న లెక్కయనువాదనజేయకు గానలోల నీ
పాదములంటబట్టు గుణవర్యుని గీతలు పాటలేమగున్
వేదము త్రిప్పఁగొట్టు బలవీర్యుని ప్రార్థనమోజు బుట్టదా ? 107

సీ. నీనామకీర్తనల్ నిఖిలార్థసంధులు
విడఁగొట్టె నిర్మలవృద్ధిగరపు
నీపాదరక్షణ నిర్నిద్రపాత్రిలు
నిర్వైర్యరహితుల నిష్పుగప్పు
నీగానగీతలు నిర్యాణమాత్రిలు
నిర్గతకాముల నిగ్గులాగు
నీధ్యానవేత్తలు నిష్కల్మషాంతిక
రణవేదభేద్యుల రవ్వులుగట్టు

గీ. రజ్జుసర్పవిభ్రాంతిని రాలఁగొట్టఁ
గరుణగననిపురుషోత్తమ కరిసువరద
సేవఁజేయుప నరుసనిం జిచ్చుబుగ్గ
పరమభక్తుని గావుమా పద్మనాభ! 108

ఉ. మానవరూపమున్న రసమాధురిగాదయ నీకుసాదమే
మానిక లోకదుర్భరసురాంగవిమర్దనజేయమానవో
ద్యానవిహారకేళి నవతారముదాల్తువు సర్వదేవస
న్మానముఁజేయుచుండియు శమంతకదేహికి దివ్యమాయనా! 109

క. నరనారాయణు లిరువురు
పరమాత్మైక్యైకకాయ భాసురదీప్తుల్
ధరశాశ్వతభోగోద్ధుర
నరుఁడీతఁడు కావవేర నరువానరుఁడా. 110

ఉ. అంచును నారసాగునటు లామునిపల్కులు ముల్కులై తగన్
మంచునుబట్టకుండ నగుమాయలమాటలమాటకారి పై
పంచను టక్కరీఁడు బలిబాపఁడు చేడెలదుమ్ముగొట్టురా
యంచల మేతబెట్టు దొర హాస్యపుగారడి జేతఁజిక్కనా ? 111

చ. చిఱునగు మోవిముంగిటను జిక్కనిమాటలు పొక్కజారుచుం
బెరపెరలాడు ముండగము పిప్పిలిచేతను నవ్వుజేయుచుం
దరిగలవెన్నజుఱ్ఱినటు తందనలాడుచుఁ బల్కరించు చూ
పరులకునేత్రమొప్పు నగుబాటులు మూటఁగోయసన్. 112

ఉ. మాటలచేత మానసికమాంద్యమువీడుట నమ్మవచ్చు నా
బాటలుదొక్కుమానవుల భక్తినిజూడగ విప్పిచెప్ప సై
గాటలు మెప్పుబట్టు ననుగారడి బుద్ధినిమళ్ళగొట్టి పై
మేటులు సిద్ధిఁబొందుదురు మిన్నలమంచును విష్ణుపల్కలన్. 113

సీ. వేయేండ్లుపోరాడి వెఱ్ఱెత్తి కరిరాజు
నిష్ఠచేసిద్ధిని నిలువఁగలిగ
నుత్త్వోత్తతోపుల నూఁగార ప్రహ్లాద
భక్తవత్సల గురుశక్తిగుదురఁ

చిరకాలతపమునఁ జెన్నారు విజయుఁడు
కృష్ణాంగసారథి కృషినిబారయు
వల్మీకిగుహలను వ్యాపించి వాల్మీకి
రామకార్యరచన రాణమెరుపు

గీ. ఊర్ధ్వమూలతపంబున నూగులాడు
నీరులెండలు తలక్రిందుదేరిచూచి
సత్పథంబును వింతగ జారిపోరెఁ
జూపుమాటలఁ జిక్కనే శూన్యహాయము. 114

చ. కలియుగ వాసమానవుల కాంక్షలు నాశలుకోటితీర్లు మూ
కలు దృఢమైన శక్తియను గాకకునిల్వరు సౌఖ్యమేహామే
పులియని మెక్కఁగూడు తరిబోటులు కాల్వలు నీతిమార్గమున్
మెలఁగరు దర్పమన్నవరిమేటులు బోధముబుద్ధికెక్కునా ! 115

ఉ. జీవితమంత యాగములుజేయుచు ధార్మికవృత్తి సత్యసం
భావముచేతఁ దృప్తిఁగొని పాలనసేయుచు రాజ్యకాంక్షపైఁ
బాపులుమాని యుద్ధమునఁ దన్మయబుద్ధిని నేనుగేగినన్
భూపర! ధర్మనందనుఁడు పూజ్యుఁడు జూడడె పాపలోకమున్.116

చ. ధనమునుఅచ్చి బోటులను దండిఁగగూర్చితి పోటుగాలమై
మనమునమచ్చుబుట్టఁ దలమైకముమేఁతను లాగులాడు వాఁ
డనయము దారిఁబట్టు నుదయాద్రికిఁ ద్రిప్పలగూడుజోగియై
జనకుని తీర్పుపోకడల జానకిసాదము విందుఁగూర్చునా ? 117

చ. జనపరిశుద్ధపాలనపు సంఘమువోటుకు దుడ్డుచేతితో
వనములఁ దేరిచూచి యిలవాకిటఁతిర్గుచు నాకునాకునాన్
ఘనమగు నాశ్రయింపుగల నాట్యము కోర్టుకుఁబాత్రికులాడు దీ
వనలను బుద్ధిమెచ్చు చలపాదుల కేమిటి తత్వబోధనల్. 118

చ. జనకుని యాజ్ఞభంగి నను జానకిమాతగ బ్రహ్మచర్యముం
గనకమునిష్ఠఁగాచి రవికాంతులఁబొందిన గాలిబిడ్డ నా
వననిధి దాఁటి లంకకలబాటుల చేతను దత్త్వపానముక్
వసనముచిచ్చుబుట్ట విధిమందరఁడయ్యెను మాయమీతెనా ! 119

ఉ. చెప్పనకొక్కమాట వినుచిక్కకసర్వముఁగట్టిపెట్టి యా
మొప్పులకుప్పఁబోలె సుఖయోగము సీతను దామరాకుపై
కప్పునఁ గల్మషంబెచటఁ గప్పడకున్నటు మానసంబునే
మెప్పున బంధనంబోరుపు మీఁదటఁజూతము చాకచక్యముల్. 120

ఉ. భోగముఁబొందుగూడినను బోటులకౌఁగిట మారుతేరుపై
మాగిడిమెట్టఁబట్టినను మంజులయోగముతీపుమాపినన్
రాగముమాడ్చి సంగరతిరంగము నెక్కిననేమి బ్రహ్మముం
ద్యాగసుబుద్ధిచేత రతిదప్పని చిత్తము నిశ్చలంబగున్. 121

సీ. సురపానముంజేయ శోధించినేఁ జేతు
లోహపాకముబీల్చ లోటుగలుగ
గోపికలంగూడు గోపాలుఁడనిగేరు
గోవర్ధనంబెత్త కొఱఁతగలుగ
మోహినిపై మీరు మునివరుడనిబోరు
బడబానలముమ్రింగ బాధగలుగ
చిరగురుద్రోహముఁ జేయఁడేచంద్రుండు
మాళ్ళియై కళలకు మంచుఁదెలుపు

గీ. ధీరులకొఱఁతలను గుట్టుదిట్టవచ్చు
వాగిఘునకార్యములఖ్యాతి చాపఁదరము
శుక్రగోపాలశంకరశుద్ధచంద్ర
ఘాళుల ప్రతాపమెప్పుడు మాయుద్విరాజు. 122

ఉ. మాయనుదాటుమానవుఁడు మానవలోకమునందుఁ బుట్టునా!
మాయకుఁదోఁడు మానసము మాటునఁ జీఁకటిసీడగుట్టునూ
గాయలమడ్డిచేతనము కాటుకపక్షివిశేషమాంద్య మై
గేయముఁజట్టిపట్టి పడఁగొంటిన వీడునె మట్టిముంచకన్. 123

ఆ. మానులైన యోగమాళులైనను నేమి
భోగిమైన నేమి బుద్ధిబుట్టు
మాయ తేనెఁబోలు మాపనుశక్యమే!
బొమ్మలైన వానియమ్మలైన. 124

ఉ. చీఁకటిగొట్టు తేజియనుచిచ్చునఁ జూపులవెల్పుదొడ్డ పై
వాకిలిమేడమెట్టు చలిబట్టును దానినినెట్టుదారి భూ
లోకమునుండి రావలయు లోకములెన్నిటిఁబాఱితేరినం
బాకముఁగట్టిబట్టకను బాపదు దెల్పుదు గుట్టునీకిఁకన్. 125

ఉ. యోగవియోగమూలమున యోనినిజొచ్చిన శూన్యమానవుల్
త్యాగవివేకధర్మమునఁ దాండవమాడరె బ్రహ్మతేజసం
భోగము వారికేతగును బుట్టనిచావనిగుట్టుత్రోవకై
వేగిన పట్టుమొక్క- లలయింతల మూద్దురు జాడఁజూడఁగన్. 126

ఉ. వేదముఁపిండిగొట్టి రసవీర్యము నిర్మలగీతమూలమున్
సాదము జేసి యిచ్చినరసంగరశ్స్త్రికి వ్యాసభాగ్యమున్
నాదములుప్పతిల్ల రసనాధరభారతరాజ్యలక్ష్మియై
మేదినిమేరువై పెరిగెమీటును నిశ్చలతత్వసాధనన్. 127

ఉ. ఆచరణంబునంగుదుపు నాఢ్యుఁడు ధాత్రిని గానరాదు నా
పాచికలన్నిటింగదుపు పావనశీలుఁడు బ్రహ్మవేత్త సం
కోచములేదు సర్వధనహాటముఁబాపిన గంధిమేరువే
ఫూచినపూవుగొమ్మ నినుబూనికఁగాచును జెంత కేగినన్. 128

చ. ధనమునుకాంక్షలేదు ధరధర్మముఁజూపును త్యాగమేమగున్
విసయముచేతఁగొట్టి జయభేరిని ద్రిప్పుచు గొట్టితిట్టినన్
దినకరకాంతినొప్పు పరదేశిని శాంతముచేతగెల్చు సా
ధనమునుదెల్పు ప్రాణమన దాహములేని వివేకిఁగూడుమా! 129

చ. గీతలనభ్యసించి గిలిగింతలఁగొట్టక వానిబోధముం
చాతముఁలార్చి బ్రహ్మము నుపాసనజేయుము ముక్తికాంతచే
మోతలఁ గామసంచయము నూర్ధ్వముఖంబున సూర్యతేజమై
పూతల నిశ్చయంబుగను బొందుదు వాదములాడ నేటికిన్. 130

గీ. అనుచు విష్ణుపలుకుల రహస్యభేద
సప్రవృద్ధి మార్గంబున నలుగువెట్ట
ద్రిగణలోక వేద్యులు దేరి తెప్పరిల్ల
దేవదేవు సెలవుఁగొని తేరునెక్కె. 131

చ. పికపికలాడు రోదనము పిప్పిలిచేతల నూర్ధ్వమూలముం
జకచకలాడు మందగసుచాతురి పొత్తుల క్షీరనీరముం
దకతకలాడు ఛేదనము తావులఁజూపుచు నీలకంఠమే
బెకబెకలాడి మీఁతెననువేపునఁ జేర్చెను బ్రహ్మలోకమున్. 132

గీ. హంసవాహనమును దిగి యజుఁడు బ్రహ్మ
లోకమును జేరు ప్రిముదవిలోకనమున
వాసవ నరనారదులును స్వర్గలోక
మునకు దేవయానము నెక్కె ముదముతోడ. 133

చ. చలిగలగాలిసీత కనుచాయను జూచుచు మేఘవారణం
బలసటఁజెందు తీవ్రమగునాజ్ఞకు మేరమీఱుచుం
గలకలగాననాదములఁ గంఠము లెత్తు విపక్షవాదులే
కొలఁగొని మెచ్చురీతులనుకూలము జేయ విమానమేగుచున్. 134

ఉ. వారణమర్మదుర్గము నివాతవిరోధనికాయవర్గసం
హారణయజ్ఞరంగము నియామవిలేఖమనోజభోగని
ద్రారణమత్సరాలయము రావణమారణశైలవర్గసం
చారము కర్మసంకగవిసర్గము భర్గము స్వర్గవర్గమున్. 135

ఉ. నందనచందనాలయము నవ్యసుపుష్పనికాయభద్రమున్
బంధురగోస్తనీప్రదము భాసురభూజము పారిజాతసం
క్రందనవాసనాన్వితము కాంతవికాససుపుష్పరాగసా
గంధము మందమారుతము కంజము కుంజము నందనంబనన్. 136

గీ. నందనోద్యానవనమునఁ జందననగ
సన్నిధిని జేరి యోధులుసంతసమున
నిష్టగోష్ఠినిసలుపుచు నింద్రవరుఁడు
తాత విష్ణుదేవుని ధీరతంత్రముఁ గన. 137

చ. శివమును బ్రహ్మతేజమును జెచ్చెరమార్చను మార్పవచ్చు నే
కవనముచేతనైన నరకాసురమర్దనవీరబాహులే
యవరునిమాయవేషముల నర్ధలమానముదొంగిలించు మా
ధవుఁ డెటు చేతఁజిక్కుమనతంత్రము మించినపోడు నారదా! 138

చ. నరవర! నీకుమాకునిఁక నాకసులోకము స్నేహగేహ సం
వరణమునై తగన్విరివివర్ధిలు నిశ్చలసర్వలోకసం
స్కరణము సంఘటిల్లెమునిసత్త్వముచేతను మానిబంపుదున్
మరువక నీతిమాటలను మన్ననఁ జేయుముసూక్ష్మబుద్ధితోన్. 139

గీ. సజ్జనులసంగశక్తి నిస్సంగ మొరయు
దానివలన నిర్మోహము దానిబట్టి
నిశ్చలంబగు తత్త్వము నివ్వటిల్లు
దానిమట్టి జీవన్ముక్తి దారిఁబట్టు. 140

చ. అనుచును బెద్దలెప్పుడును యాత్రలఁ జేయరె! నీకు మౌని చం
ద్ర నిగమవేదిసంపదల దక్షిణహస్తము చేతికిచ్చి భూ
వనముల త్రిప్పి బోధనను పర్వము జేయుము పోయి వచ్చెదన్
మునివరతోడు నీడయగు మూలము జూపుము శాంతిఁ గూర్చుతన్. 141

ఆ. అంచుఁ బల్కి నింద్రునాజ్ఞను గైకొని
మనుజమౌనియంత మందగమన
వాయురమణవీధి బాటలుతోటలు
దేరిచూచు వాలు తేంట్లమ్రోఁత. 142

గీ. జల్లుమంచెగయు విహారచంచలౌఘ
ఘోరమేఘనినాద నిర్ఘోషచంద్ర
బింబసంచారమాయన వేల్పుత్రోవ
బొజ్జలో మాయఁ జూపట్టు స్ఫూర్తిమెఱయ. 143

ఉ. కాంచిరిమంచుకొండనడిగట్టుల పట్టెసి తెల్లనైన పై
పంచను నిమ్మ గూడచలిబండలు దండులు మిక్కుటంపు ప్రా
పంచముక్రింది గ్రుడ్డు పులివాతలు దుస్సులు వెన్నగాలి నీ
దంచలు నీరుమున్గ నడియధ్యపుపాంతలు దండికొండలున్. 144

ఉ. దాఁటుచు ఋష్యశృంగనగ దాతను వ్యాసుని జూడవేడుకన్
మాటున వాహినీసలిల మంగళగంగను బ్రార్థనంబుచేఁ
జాటున బీరపాదుదడిసందున దుబ్బులపెంపుగడ్డ మా
ర్భాటముజూచి మెప్పుగను రాజ్యము వ్యాసము నేత్రపర్వమున్. 145

ఉ. నారదమౌని వీఁడెవఁడు నాకడ కేగుట కార్యమేము! సం
చారము ప్రేమమీఱుటను సత్వరసిద్ధిని బొందుఁ గూర్చు మీ
తీరవివేకసంవిదులు తీక్ష్ణసుగోష్ఠులు క్షేమమాత్రతే
ధారణశక్తి గీతముల ధాత్రిని వృద్ధులెయుంచుఁ బల్కఁగన్. 146

చ. నినుగని చూచిపోవుటకు నీరజలోచనవచ్చినాము పీఁ
డినచరభూమివర్తనుఁడు ప్రేక్షణదూతవిదాహవేది కం
జనగురుభక్తిగోరుతరుసాక్షివి నీవని వెంటఁగొంటి ని
ర్జన నగదేశికోత్తముఁడు సత్యముఁదెల్పఁడె వ్యాసవిశ్వమా! 147

శా. నీకంటెన్ ఘనుఁడెవ్వఁడీజగతి వాణీనందనా! చిత్తమే
పోకంబట్టిననిప్పుగర్గు కలహంబుంబువ్వ సంగీతమే
ప్రాకుంజుట్టిన నీరుగారు సురసామ్రాజ్యంపుజేయూతతో
మేకున్నట్టిననీకసాధ్యముగునేమేల్మోని యూహింపఁగన్. 148

చ. పులియని శిష్టగోష్ఠి చలిపూతలనిగ్గును జిట్లగొట్టురా
కలములఁగూర్చుపోలికలు కానని వానికిఁద్రోవఁజూపు పూ
పూపలుకులు మచ్చుజల్లు వడపప్పులు బెల్లముఁబోలు లోనిచూ
పులులుమతీయమాటలకుఁ బుట్టినయిల్లగు వేదభాష్యముల్. 149

ఉ. నారదబాదరాయణ ఘనాఘనవాదముఁజెందఁజేయు మం
దారమరందగంధఫలిద్రాక్షము మాలినిగోరిలుమేటి హుం
కారముదారిఁబట్టుటను గాననిమానసమానసాక్షిగో
దారినిగట్టుపట్టుటలు తథ్యము భోగికిఁ ద్యాగమబ్బునే! 150

గీ. వ్యాసనారదులు హిమాలయాద్రి కంద
రములఁజూడఁబోయిరి నరరాయుఁడుదధి
దాఁటిదేశాంతరంబులఁదమినిజూడఁ
దేరునెక్కి బయలుదేరుతీర్లుమెఱయ. 151

శా. ఎండేనాడును గానరాక చలిమంచే కప్పుచుట్టుండు నీ
రండేచిక్కదుబొగ్గు మిక్కుటము పంటన్నన్ వివృద్ధంబుతే
కుండేయిల్లట తెల్లలచ్చితలకిందేయుండు పిళ్ళారికై
దండంజేతల నోడతీర్పరయు గుండ్రింబైన దీవింగనెన్. 152

ఉ. అచ్చటి సౌధమేరువులు నచ్చటిసౌఖ్య పరంపరాళియు
న్నచ్చటి కార్మికోత్సవము నచ్చటినాట్య విమోహపాత్రలే
యచ్చటి సంఘసంస్కరణ యాత్రలు నచ్చటివారి తంతులే
యచ్చటి యంత్రవేదనము నాయువుపోలను దక్కఁజేయుచున్. 153

గీ. సంశయంబు తప్పకగల్గు సారయంత్రి
సాధనిక్షిప్తభూషణ శస్త్రధాత్రిఁ
జూచితొలిదీవి మించిన సంగరంబు
చరణచాతురిగుప్త విసర్గమనుచు. 154

సీ. చేతులజోడించు శిష్టము విరివిగ
విందులఁగూర్చుట వేడ్కమీఱ
విస్కినిద్రాగుట వెఱ్ఱెత్తిపున్నాగ
కంధరకేళిని గాంచిమీఱ
సత్తువలేనట్టి శాలినిబోఁగొట్టి
గోడ్డునాలికలను గోరమీఱ
స్వాతంత్ర్యమేస్త్రీకి శాసనమంచును
నిచ్చువచ్చినరీతి నేపుమీఱ

గీ. నిముసమునకొకవింతగు నెమలిమార్పుఁ
గలుగు దేశముఁజూచుచుఁ గదలియుదధి
దాఁటియాఫ్రికానేటాలు సూటిదారిఁ
బట్టి బొంబాయిమీఁదుగా బసనుజేరి. 155

చ. ధనమును గోలుపోక మఱిదానముఁజేయక భోగమేమియో
ననయముపీడకుండ మరి యాదలతోడుత తత్త్వశాస్త్రమున్
మననముఁ జేతునంచుఁ జని మాన్యతనొందితి పీనినన్నిటిన్
మునిఁగినవేనునిర్మల విముక్తుఁడనైదును మొన్న జేనియున్. 156

ఉ. మానము ప్రాణమున్ ధనము మాపున సర్వము త్యాగశూన్యమై
గానము చేతరాట్నమునఁ గాసుల బేరముఁ జేయఁజెప్పుచుం
గాననమందుఁ దీరు ముని కుంజరుఁడంతటివాఁడు వాని నే
ధ్యానము చేతఁ బొందనగు త్యాగము జేయను భోగమొప్పునే! 157

ఉ. అంచుఁ గృషీవలుండు విషయార్తిని గుందుచు ముక్తిమార్గమే
పంచను దారిఁ బట్టె పొరపాటు ప్రపంచపు కుక్షిలోపలన్
దించిన కామరోషములఁ ద్రెంచుట నాకెటు చేతనౌను సా
మ్మంచును గల్వరించి తనయాప్తులఁ జూచుచుఁ బొంగుచుండఁగాన్. 158

ఉ. శాసనశారదా ప్రమద చట్టము బుట్టుట దేశమంతటన్
వాసనగ్రమ్మి చుట్టుకొన బాపలరోదన మేమిచెప్పుదున్
గ్రాసముకూలిపోయెఁ దడికన్నులఁ దేలుచు దొంగత్రోవలన్
మీసలుదువ్వి పెండ్లిలులు మిక్కిలి జేయఁగ వ్యాజ్యమేమగున్. 159

ఉ. కాలముతీరుమారె పలుగాకులు వృత్తులు పంటవృద్ధియై
మూలమునొవ్వఁ జేయు ధరముగ్ధను జేసిన కాసులున్నవాఁ
డేలును భూమిసన్నగిలె నెవ్వఁడు పూజితుఁడప్పులెక్కువై
మాలును మ్రింగె రొక్కమనుమాటలు జూడరు చెప్పరాదిలన్. 160

చ. ధనమును మేదమిద్దెలును ధాత్రియుభోగము ద్రొక్కిబట్టి తా
ననయము ముక్తిమార్గమున నాతఁడు బట్టక యేమిసేయు సా
ధనమున శక్తిఁ గూర్చి మనుధర్మము భక్తియుభుక్తి గూర్చుమే
ల్వినయము జేతఁ బట్టి నరవీరుఁడు కానకు నేగుదెంచుచున్. 161

చ. నరవర కూర్మిపుత్రిలిల నాగలిదున్నుచుఁ బొట్టఁబోయుటే
పరమపవిత్రమార్గమని పల్లెలు శాంతిసుగూర్చు సౌధముల్
నరకనివాసతుల్యములు నాఁడులు కాపురముండ గొచ్చుచేఁ
గరపులు పట్టణంబులని కాపురమేగిరి చింతపీడుచున్. 162

గీ. అంచును గృహీవలునివృత్తిఁ బొంచిపూనఁ
బ్రిథమనగరవిలాసముఁబాఱఁజూడఁ
దండ్రి తనయులు వెడలిరి తమినిబొదుగ
స్వగృహామునను స్వధర్మముఁ జలుపనెంచియు. 163

గీ. భూమిఁజుట్టితిరిగి మొదటిపొంతసూటఁ
జేరవైకుంఠపాళిని జారి మొదటి
మెట్టుగలసినటు సకలమిత్రమండ
లములఁదేరి చేరిరినగరిముదముగన. 164

చ. తనప్రియభార్య కాలయమదండముఁజిక్కను కోర్కిమీఱఁగాఁ
దనయులఁబెండ్లిఁజేయుటకు దారుణశారద చిచ్చుఁబెట్టె భూ
వనములఁబోవ సొమ్ములవలుబాటలు బట్టెనుభుక్తికేమియుం
గనఁబడదేమిసీతు వనకందరకేగక సన్న్యసించకన్. 165

గీ. తనువశాశ్వతము ధనముతనకువెంట
రాదు ధర్మప్రవర్తన పోదు సత్య
సంధులైన రారాజులు జగతిఁగలరె?
శాంతిఁగూర్చు మార్గంబేది భ్రాంతిమాపు. 166

గీ. అని కృషీవలుఁడు నివృత్తియజ్ఞఁభోజ్య
దగ్ధవైరాగ్య గోచరముగ్ధమాన
సేంద్రియవశీకరణ విమలేక్షణరవి
రాజ్యకాంతుకై శోధించు పూజ్యతఁదగ. 167

చ. తనువును మెట్టుకామములఁ ద్యాగముఁజేయుటకంటె భుక్తికై
కనకముమీఁద నిచ్చగల కాపురమెట్టులు శాంతిఁగూర్చు కా
ననమునకేగి తృప్తియను నావముజేకొని పండ్లనీరు భో
జనముగమార్చి ముక్తిపదసద్గురు సన్నిధిఁజేరఁగోరుదుర్. 168

ఉ. గడ్డముజుట్టు మీసలును గంతలుగట్టఁగ రోమరాశిపై
గుడ్డలుపచ్చరాలదిగఁ గొట్టుచు మచ్చలకఱుపాలచే
పొడ్డునరామకీర్తనల చోద్యముఁజూపుచు బిక్షమెంతపైఁ
బడ్డస్వకీయ సౌఖ్యములఁబంచుదు స్వానుభవాక్షమాలికన్. 169

క. అనుచున్ బోధనఁజేయుచు
మునివృత్తింబూని గ్రామములఁబోవ్ర గుజీ
వనమున్ గడుపువివేకిని
జనములుజుట్టి వివరించి శాస్త్రములనుగన్. 170

క. సత్యముధర్మము కన్నను
నిత్యంబగు వస్తువేది నిర్మలమతియో
సత్యముఁ దెలుపును బ్రహ్మము
నిత్యముతదితరము మిథ్యనీలోఁజూడన్. 171

ఉ. మీసలుదీసివేసిన సమీరమునొత్తిన భూతిఁబూసినం
బూసలురుద్రమాలికలు ముట్టినయాత్రలు పూజజేసినం
గాసులు ధర్మమిచ్చినను గానలకేగిన భ్రాంతిపోదు స్వా
వాసముదోషమేమిటికి బాయును సత్యము జూడఁజూడకన్. 172

గీ. జుట్టుబోడిజేసెనుగాని గుట్టుదెలిసి
మనసునిశ్చలత్వముఁ జేయు మనుజుఁడెవఁడు!
పొట్టకూటికై పైఁబడ్డ పొట్టిదార్లు
మనము సన్న్యసించను శక్యమా! మనలకు. 173

గీ. కాంతలనడిమి బంతుల కాంతిఁజూచి
మోహవారాశిం గ్రుంకు మొద్దుఁబోలి
మాంసరక్తవిశేషము మహిమగనక
తెలిసి గోతిలోదుముకుట పలువతనము. 174

ఉ. వృక్షమునీడ క్రిందుగను వర్తిలుదేహికి పాన్పులేటికిన్
భిక్షముఁబెట్టు పూరుషులు పెంపెసఁగంగ నివృత్తిమార్గ సం
రక్షణజెందఁజేయు వనరాశినినేగక కర్మరాశిలో
శిక్షణమబ్బు శోకమునఁ జిక్కులఁగుందుట దేహికేతగున్. 175

గీ. అశనముంబెట్టు వనములు నాప్తమిత్రుఁ
బోలిగాలివీచును దాహమును విదల్చు
నదులుభూదేవిపడియుండు సదనమిచ్చు
నాశలేటికి విడఁగొట్టు నార్యపుత్ర! 176

గీ. అనుచు బోధనముంజేయు నాతఁడేగు
దెంచు గ్రామసీమలకు విదేహముక్తి
మార్గసన్న్యాసముంజూడ మదినివింత
సంశయంబును జూపట్టు శాంతిమెఱయ. 177

ఉ. వానివి భాగ్యభోగ్యములు వానివి పంటలు గాలిచుట్టముల్
వానివి శిష్టవర్తనలు వానివి సౌఖ్యములిచ్చు వృక్షముల్
వానివి ధర్మపద్ధతులు వానిస్వతంత్రవివేక మార్గముల్
వానికి ముక్తికాంత పురపాలనఁజేకురు సన్న్యసింపగన్. 178

మ. సముఁడై యెవ్వఁడు కామరోషముల మాత్సర్యంబు జెందాడుఁ ఖే
దములేకెప్పుడు కష్టసౌఖ్యముల ద్వంద్వంబునంగాల్చు వా
దములేకుండఁగ శాంతబోధమున సత్యప్రోక్తతత్త్వంబు త్యా
గముఁజేపట్టిన వానికేదొరలు సాక్షాన్మోక్ష సౌఖ్యోన్నతుల్. 179

ఉ. వానికిఁ గొంతుయొక్కఁడిది భాగ్యముతోఁ బనివానికేమి! వా
గ్దానము పుణ్యపాపముల దక్షిణవానికి బోధమానెమున్
ధ్యానముదప్ప వానికిఁక యోగములేటికి బ్రహ్మచర్య సం
ధానము సాంఖ్యతత్త్వమున దాపునఁజేర్చునువీఁడువాఁడుగన్. 180

ఉ. వానికి వీనికైక్యమును భావముజేకుర సర్వమాత్మయన్
ధ్యానము రూఢిమీఱు సమవర్తనధాత పిపీలికాదిపై
మేనని ప్రేమదారుఢన మేరువు దాఁటును జ్ఞానరూపమేఁ
నేనను వానికేఁగాఁనువ నిశ్చలచింతన దప్పకేటికిన్.

శా. సంసారాంతక నిర్గుణైక్య నిగమాచారాప్త మిత్రప్రియా!
కంసోన్మాద విరూపమర్దన నిశాకారేభ సింహప్రభా!
హంసోన్మీల విసర్గసద్గుణ నిరూప్యాంగ ప్రభాబీజమా!
పుంసత్వస్ఫుట గోపలీల జితసంపూర్ణాక్షు చింతామణీ!

చ. కవిజనకల్పవల్లి వరకాంచనభూషణ భద్రవల్లి మా
ధవగణపుష్పవల్లి, పరదాస్యవిమోచన రత్నవల్లి, భా
రవిధనపోషవల్లి, జనరక్షకృషీవల వెంకటప్పయా
ఖ్య విరచితాంధ్రకావ్యము సమాప్తముపేర్చు విలాసవల్లియై.

కృషీవలవిలాసము,

చతుర్థాధ్యాయము,

సంపూర్ణము.

# తప్పొప్పుల పట్టిక.



| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| పీఠిక 1 | 13 | విూదఁనే | విూఁదనే |
| 1 | 2 | శ్లీరా | స్తోకా |
| 2 | 12 | లష్మ్మ | లక్ష్మ్మ |
| 7 | 3 | సౌరంభా | సంరంభా |
| 7 | 16 | జానిక | జానకి |
| 11 | 5 | తీరస్తు | తీరస్థు |
| 13 | 11 | సింహులుం | సింహముల్ |
| 13 | 12 | పుల్కులు | ఫుల్లులు |
| 13 | 18 | చలమల | చెలమల |
| 16 | 19 | స్వాధ్వస | సాధ్వస |
| 20 | 2 | క్రాంతా | క్రాంత |
| 21 | 13 | వొరగి | నొరగి |
| 22 | 20 | మానినె | మానిరు |
| 25 | 17 | సద్గోష్ఠి | సద్గోష్టి |
| 27 | 6 | మెఱయన్ | మెఱయఁగన్ |
| 32 | 4 | చలంచల | చంచల |
| 32 | 23 | కవి | కలి |
| 34 | 20 | గర్వంగను | గరపంగను |
| 35 | 4 | సభస్థిత | సుభాస్థిత |
| 35 | 7 | సరసాశ్యర్భట | సరసాశ్యార్భట |
| 36 | 5 | శోభ | శోభా |
| 39 | 20 | దురపల్గునె | దురద గల్గునె |
| 40 | 4 | గూర్ఫన్ | గూర్పన్ |
| 41 | 5 | లతికా | లలితా |
| 46 | 13 | విద్యుచ్ఛక్తియె | విద్యుదాభమె |
| 46 | 21 | రజతవి | రజితనవి |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 109 | 16 | యాథ్వ | యథ్వ |
| 110 | 11 | పూపలుకు | పలుకు |
| 110 | 10 | కలములు | కలుగులు |

